# గణపతిముని జీవిత సంగ్రహ చరిత్ర



* శ్రీముఖము *

శ్యామ్‌శ్రీచరణ్ బాబా

రచన

పోటూరి హనుమజ్జానకీరామశర్మ

శ్రీ గణపతిముని చరిత్ర



ప్రతులు : 1000

మూల్యం : 15-00

ప్రథమ ముద్రణ : 1992





*This book is Published with the financial aid of T.T.D. under their scheme "Aid to Authors"*

ముఖపత్ర శిల్పి : చి॥ తుర్లపాటి శివానంద

ప్రతులకు : శ్రీ రావినూతల శ్రీరాములు
10/101 క్రిష్ణనగర్,
కర్నూలు – 518 002

ముద్రణ : అరో ప్రింటింగ్ ప్రెస్,
తాడిపత్రి – 515 411



శాంతిర్నితాంతమధికాపరమాస్యశక్తిః
వైరాగ్యమద్భుతతమంకరుణాతుసాంద్రా ।
జ్ఞానంనిరస్తకుహనంమధురంచవృత్తం
నృణాంనిదర్శనమయంరమణోమహర్షిః ॥

# కృతజ్ఞతలు

ఈ గ్రంథ రచనకు మా ప్రార్థన మన్నించి పూనుకొన్న గురువర్యులు శ్రీ పోలూరి హనుమజ్జానకీ రామశర్మ గారికి, ఆదరముతో శ్రీముఖము అందించి గ్రంథ ప్రాశస్త్యాన్ని ఇనుమడింపజేసిన శ్రీ శ్యామచరణ బాబా గారికిన్ని, నాయన కపాలి చిత్రాలను అందజేసిన శ్రీ యం, పి. పండిట్ (శ్రీ అరవిందాశ్రమం) గారికి, అందముగా ముద్రించిన ఆరో ప్రెస్ వారికి, సహకరించిన శ్రీ బి. నరసింహయ్య గారికి కృతజ్ఞతాంజలులు.

— రావినూతల శ్రీరాములు

# విషయ సూచిక

ఓం

# శ్యామ్ శ్రీచరణ్ బాబాగారి
# "శ్రీముఖము"

ఓం నమో భగవతే, శ్రీ రమణేశ్వరాయ, అరుణాచలేశ్వరాయ, ఆదిమధ్యాంత రహితాయ, అప్రమేయాయ, ఆనందదాతాయ నమోన్నమః

అభ్యర్థన:- ఈ జీవిబుద్ధి పరిమితము. వ్రాసేది అపరిమితమును గురించి. ఇది సబబుకాదని తెలుసు. ఆశ యనెడి పాశము ఊరకే నుండనివ్వక తెలిసీ తెలియని ఆలోచనలను రేకెత్తించి ఏవేవో అక్షరవాక్య విన్యాసాలను చేయిస్తున్నది. పరమాత్మ సృష్టిలోని జీవి మాటలు, చేతలు, వ్రాతలు వచ్చీరాని మాటలవలె, నడకవలె తడబడుతూ వుంటాయి. అవి కొన్ని జీవులకు, సంతృప్తిని, మరికొన్నింటికి అసంతృప్తిని, మిగిలిన వానికి ఉదాసీనత, నిరుత్సాహము......వగైరాలను కలిగించుట ప్రకృతి సహజము. తుమ్ము, దగ్గు, వమనములను ఆపుకోవడానికి ప్రయత్నించడము ఆరోగ్యానికి క్షేమకరం కాదని పెద్దలంటారు. అలాగే సక్రమమని అన్పించిన దానిని అక్షర రూపంలో నిర్భయంగా పెట్టలేక పోవడం కూడా భవరోగానికి మంచిదికాదు. ఎందుకు? తద్వారా త్రికరణ శుద్ధి లోపించడమే కాక "నేను" బలమై బుద్ధిశక్తి నిర్వీర్యమై, అకాశవాదము నుండి దిగజారి అశాశ్వతమగు అవకాశవాదమునకు మూలమౌతుంది.

పిచ్చివారి వెఱ్ఱి వ్రాతలు తలరాతలను మార్చగలవోలేవో కాని, మనోరాతలను మాత్రం కదిలించక మానవు. అదే పిచ్చివాని వెఱ్ఱి వ్రాతలలోని గమ్మత్తయిన మనస్సుకు హత్తుకునే మహత్తు.

వద్దని వదిలించుకున్నా, విదలించుకున్నా వదలక చుట్టు కునేదే ప్రారబ్ధము. అది మంచో, చెడో. నిర్ణయించుకునేది ఆలోచ నలకు బంధుడై బద్ధుడైన జీవుడు, తన ప్రారబ్ధానికింకెవరో కారకులనడం అమాయకత్వం. తన భావనలే, ఆచరణలే, తనను నడిపిస్తున్నాయని, అలాగే యితరుల విషయంలోనని కూడా తెలుసుకోగలిగితే – ఇక వాదనలకు, వివాదములకు, వింత వింత పోకడలకు, విమర్శలకు, తావుండక – వివేకానికి దారి తీస్తుంది. ఇదే భావన ఆలంబమైన ఈ క్రింది వాక్యాలు ఎలా స్పందింప జేస్తాయో ............................................................................(?)

పూజ్యపాద ప్రేమ స్వరూపులగు తల్లిదండ్రులకు (రచయిత, ప్రోత్సాహక దంపతులకు) – ఈ బిడ్డకు మధ్య పరమాత్మ వేసిన బంధము – ఋణానుబంధము మాత్రంకాదు. ఆత్మానుబంధము యొక్క ప్రతిస్పందనే కదలని కలాన్ని కదిలించింది. వీటన్నిటి వెనుక అదృశ్యంగా వుండి నడిపిస్తున్న శక్తి ఏదో వుందని అని పిస్తుంది, కానీ తెలియదు. చూడలేదు. కనుక వుందని నిర్భయంగా చెప్పలేను. అందుకే జన్మకారకులు, జన్మచరితార్థకారకులు నగు తల్లిదండ్రుల పావన పదపద్మములకు కృతజ్ఞతతో, ప్రేమతో శిరసా నమస్కరిస్తున్నాను. నాకు మాతృభాషయే సరిగ్గారాదు. వ్యాకరణం రాదు. వ్యావహారికంరాదు. గ్రామ్యము, దేశ్యములసలేరావు. మరి నాకొచ్చిన దేమిటంటే అన్నీ కలియబోసిన భాష. దానికి మీరేమి పేరు పెట్టుకున్నా నాకంగీకారమే. అందువలన భాషకు, భావ ములకు వీడే బాధ్యుడు.

క్లుప్తంగా రెండు వాక్యాలు. ఈ శ్రీముఖంలోని భావాలు కేవలం ఈ జీవి పరిమిత బుద్ధివే. నృశంసనములు మాత్రం స్వీక రించడానికి సంసిద్ధత వ్యక్తపరుస్తూ వీలైనంతమంది తమ నృశంస నములను పంపించవలసినదిగా ప్రార్థిస్తూ ఇక మొదలిడతాను.

ఓం

# నయనానందకర నాయనాయనమః

శ్లో॥ గురు మన్త్రో ముఖేయస్య తస్య సిద్ధ్యన్తి నాన్యథా ।
దీక్షయా సర్వకార్యాణి సిద్ధ్యన్తి గురుపుత్రకే॥ — శ్రీగురుగీత.

శ్లో॥ నిత్యానందం పరమసుఖధం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్ ।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షి భూతమ్
భావాతీతం త్రిగుణ రహితం సద్గురుం తన్నమామి ॥

శ్లో॥ వటవిటపి సమీపే భూమిభాగే నిషణ్ణం
సకలమునిజనానాం జ్ఞానదాతారమారాత్ ।
త్రిభువనగురుమీశం దక్షిణామూర్తిదేవం
జననమరణ దుఃఖచ్ఛేద దక్షం నమామి ॥

శ్లో॥ చిత్రం వటతరోర్మూలే వృద్ధాశిష్యా గురుర్యువా ।
గురోస్తుమౌనం వ్యాఖ్యానం శిష్యాస్తుచ్ఛిన్న సంశయాః ॥

శ్లో॥ మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం ।
వర్షిష్ఠాన్తేవసదృషిగణైరావృతం బ్రహ్మనిష్ఠైః ।
ఆచార్యేన్ద్రం కరకలిత చిన్ముద్ర మానన్దమూర్తిం ।
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తిమీడే ॥

శ్లో॥ బీజస్యాన్తరివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పునః
మాయా కల్పిత దేశకాలకలనా వైచిత్ర్య చిత్రీకృతమ్ ।
మాయావీవ విజృంభయ త్యపి మహా, యోగీవయస్స్వేచ్ఛయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥

శ్లో॥ బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి
వ్యావృత్తాస్వను వర్తమాన మహ మిత్యన్తః స్ఫురన్తస్సదా।
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యోభద్రయాముద్రయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥

పై శ్లోకాలలో స్థూలముగా గోచరించే అర్థానికైననూ, అంతర్లీనమై నిండి నిబిడీకృతమైయున్న అంతరార్థమునకైననూ, శ్రీగురు శిష్య సంబంధము, శ్రీగురుడే పరబ్రహ్మమనెడి నియమబంధము, అర్హత, యోగ్యతలు గల్గిన శిష్యులకెలా శ్రీగురు పరబ్రహ్మ కృప లభ్యమగునో యనెడి మధురానుబంధములు, అంతరాంతరాళము లను తట్టి తమస్సునుండి లేపి తపస్సునకు వెళ్లమని ప్రేరేపించ గలవు. పారమార్థికమున తపన, తపన అధికమైన అదియే తప స్సుగా మారి తమస్సును తొలగిస్తుంది.

భగవాన్, నాయనల బంధము, అటువంటిది. నయనములు అందరికీ వుండవచ్చును. కానీ చూడగలిగే శక్తి కొందరికే వుంటుంది. అదియునూ వారివారి సంస్కారములను, ఆలోచనలను బట్టి, చూచిన దానిని గురించి ఏదోఒక భావన కలుగుతుంది. అలాగే సత్యాన్వేషణతో పరితపించే హృదికల్గిన నయనములతో, నాయన చరిత్రను పారాయణమొనరిస్తే నయనానందకరముగా బాష్పానంద ములు భగవాన్ నాయనల పదపంకజములపై కృతజ్ఞతతో అమృత జలపాతముగా వర్షించగలవు. ఆ అదృష్టశాలురెక్కడో ఒకరిద్దరుండ వచ్చునేమో ! చదవడం మనస్సుతో చేసే ప్రక్రియ. పారాయణం బుద్ధితో జరిగేక్రియ. పారాయణం పరాయణత్వాన్నిస్తే చదువు ఆలోచనలను రేకెత్తించి, ఊహన్ని పెంచగలిగే ప్రమాదం కూడా కలదు. చదువు భౌతికము, ఊహమునకు నాంది. విద్య పారమార్థి కము వివేకమునకు నాంది. "విద్యయొసగును వినయంబు" విద్య,

చదువులతో మొదలైన నాయన జీవితము చదువు నశించి, విద్యతో అంతమైనది. కావుననే నాయన'నాయన'గనే అందరినోట తెలిసియో తెలియకయో పిలువబడుచున్నాడు. నాయనలోని విశిష్ఠత, విశ్లేషణ లకు అందనిది, విచక్షణకు చిక్కనిది, విచారణకు దొరకనిది.

దాదాపు 14 (పదునాలుగు) సం॥లు అరుణగిరిమీద మొలకు గోచితో, చేతిలో కర్రతో, అటునిటు తిరుగుచూ, చూచుచూ, చూడ కుండా, ఆయనను చూడటానికి, దర్శించడానికి వచ్చిన వారిచేత బ్రాహ్మణస్వామిగా, మౌనస్వామిగా పిలువబడుచూ వచ్చిన జంగమ మగు అనంతశక్తి, చివరకు ఆ జంగమమునకు భౌతికముగా కారకురాలైన తల్లివచ్చి మూడు దినములు రోదించి, విలపించినా, పెదవికదపక, మౌనముగా నుండిన తేజోమూర్తిని, పెదవిని కదలించి, కంఠమును స్వరపరచినది నాయన. ఆ క్షణమునుండే ఆయనను దర్శించే వారందరి పంటలు పండినవి. వీనులకు విందులు, కను లకు పసందులు. జిహ్వకు రుచులు, ఆత్మకు అభిరుచులు ఆటలు, పాటలు – ఇలా ఎన్నో, యింకెన్నెన్నో మానవులకు అందని మధు రానుభూతుని అనుగ్రహించినది. – మన నాయన నడచి వచ్చి నయనానందకరముగా ఆ మౌనస్వామిని మౌనమునుండి విడిపించి "నాయనా" అని పిలిపించుకుని మనలను తరింపజేసినది – ఆక్షణమునుండే.

అంతవరకు అంతుదొరకని, అర్థంకాని, అదేదో తెలియని మౌనం – అంటే నిశ్శబ్దంలో వుండిన దొక ఆకారము. దానికే భగ వాన్ రమణ మహర్షి అని ఆ తర్వాత నామకరణము జరిగింది.

ఇక నాయనో! ఒకటే శబ్దజాలమయం. చిన్ననాడే నవద్వీప ములో కావ్యకంఠ బిరుదు. మహారాజుల వద్ద సన్మాన, సత్కార, గౌరవాదులు, అనేక మంత్ర, యంత్ర తంత్ర శాస్త్రములలో సరిలేని జోడు. పట్టుదలకు మారుపేరు. వ్యక్తులను, వక్తలను, ప్రత్యర్థులను

సశాస్త్రీయంగా వాదనలలో అత్యంత సులువుగా గెలిచిన ధీరోదాత్తుడు. దేవతలనేకుల దర్శన కృపలను పొందిన స్రష్ట. అనేకానేక మంత్రములలో ద్రష్ట. "తారామంత్రము" ఉత్తర భారతమునుండి దక్షిణ భారతమునకు దెచ్చినది నాయనే. పుట్టుకనుండియే వాక్సిద్ధి. నిర్భయత్వమునకు మారుపేరు. ఏకసంథాగ్రాహి. సూర్యునివలె కళంకరహితమగు భావన, ఆచరణ, నమ్మిన సిద్ధాంతములపై సమదృష్టి, గణనాథునివలె విఘ్నములెన్ని ఎదురైననూ చలించక, అదరక, బెదరక, తప్పించుకొన యత్నించక, ధైర్యముగా నెదుర్కొని విఘ్నములకే విఘ్నములను గల్గించి, నిర్విఘ్నముగా అసంఖ్యాకమగు శిష్యబృందముతో, భారతావనిలోని అనేకానేక ప్రాంతములలో తనపేరు మారు మ్రోగుచుండ ధీరుడై, గంభీరుడై, ప్రచండుడై దేశ దాస్యవిముక్తికై, వైదిక ధర్మోద్ధరణకై సంకుచిత కుటిల మనస్కులగు పండితులమని పిలిపించుకునే వారల అహంకారములను పాతిపెడుతూ, దిగ్విజయ యాత్రలతో, పుణ్యక్షేత్ర, తీర్థ, సందర్శనములతో, ప్రజల నుత్తేజ పరుస్తూ, కార్యోన్ముఖుల కావిస్తూ, అతులిత ప్రజ్ఞా పాటవములకు ఆలవాలమై వెలుగుతూ వుండిన నాయనకు ఒక క్షణమున "తనను గురించి తానెరుగ దలంచిన వేళ" తను అంతవరకు నేర్చినది తృణప్రాయమని గ్రహించి, సత్యాన్వేషణ తత్పరుడై అరుణగిరిని చేరి అందు జంగమస్వరూపముగానున్న తేజోమూర్తిని చూచి – అహంకార, మమకార, వగైరాదులను వీడి సాష్టాంగ ప్రణామమొనరించి, వినయశీలుడై, వివేకోదయము కొరకు ఆత్మోన్నతి కొరకు, తానెవరో తెలుసుకొనుటకై పరితాపముతో తన అంతరంగిక బాధను వెడలగ్రక్కినాడు.

ఒక విషయం : మనము ఎక్కడికైనా వెడితే మన బంధువులో, స్నేహితులో, ఆశ్రితులో వుంటే ఎదుటివారికి సాష్టాంగ పడటం నామోషి అనిపిస్తుంది. అహంకార మడ్డువస్తుంది. మరి

మన ఊహకందని స్థితినందిన నాయన ఏమీ లేని, సామాన్యునివలె కన్పించే మౌనస్వామికి సాష్టాంగపడటం, నాయనకే చెల్లిందికానీ, నాలాంటివారికది జన్మజన్మ పరంపరలకు కూడా కలుగదేమో! ప్రస్తుతము ఈ విషయంలో మన దేశంలోని కొంతమంది తల్లి దండ్రులను, వారిపిల్లలను మనము అభినందించక తప్పదు. జన్మ నిచ్చిన తల్లిదండ్రులకే నమస్కరించుటకు మనస్కరించకపోగా, వారిని చులకనగా చూసే దౌర్భాగ్యపు జాతికి చెందిన వారుండటం, వారికి సరియైన ధర్మ, కర్మాచరణలను నేర్పని తల్లిదండ్రులను చూడటం వలన, బహుశావారు ఈ దేశవాసులు కాని వారేమోననీ, గతిలేక పొట్టకూటికై, అన్నింటినీ అందరినీ ప్రేమ, సమత, మమతలతో యిడుడ్చుకునే హైందవ ధర్మమునకు ఆలవాలమైన భారతమాతకు దత్తు కొడుకులుగా వచ్చినారేమోననీ, అందుకే తల్లిపాలు త్రావి రొమ్ములు గ్రుద్దే ప్రబుద్ధులుగా తయారౌతూ – తామేదో దేశానికి లోకానికి సృష్టికీ, సంఘానికీ సేవలు చేస్తున్నా మనే అవివేకముతో డప్పులు వాయించుకుంటూ, పబ్బం గడుపు కునే వారిని అభిశంసించక అభినందించగలమా? అలాంటివారికి మహాత్ముల ప్రవర్తన, నాయన నడక, భగవాన్, సాయినాథ్, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, శ్రీఅరవిందుల లాంటి ఎందరెందరో జీవిత చరిత్రలైనా కనులు తెరిపించగలవు. అయినా నా వెఱ్ఱిగానీ వారికి అటువంటి, ఆశ, ఆశయము, ధ్యాస, ధ్యేయ ములు వుంటేకదా! అందుకే ఓ సహనశీలీ భరతమాతా! నీకు మమ్మల్నందరినీ సమానంగా భరించక తప్పదు.

అప్పుడు ఆ మౌనస్వామి కంఠమును సవరించుకొని ఒక చిన్న వాక్యములో "మంత్ర నాదమెక్కడ పుడుతుందో చూడ" మని అన్నాడు. అంతే – అదే మరువలేని, మధురాతి మధురమైన క్షణం మనోజ్ఞ మంజుల సుందర సమ్మోహన దృశ్యం. దానిని చూడగలిగే

శక్తి గలిగి చూచిన వారెవరైనా వుండి వుంటే ధన్యులు. ఆ క్షణంలో మానవులెవ్వరూ లేరక్కడ. మహాసిద్ధపురుషులు, అర్ధనారీశ్వరుడు మిగిలిన దేవాది బృందములుండి వుండవచ్చును. ఆ తర్వాత క్షణాలలో వచ్చాడు పళనిస్వామి. నివ్వెరపోయాడు.

నిశ్శబ్దమునుండి శబ్దము మంద్రస్వరముగా వెలువడింది. శబ్దజాలమయమున కొలవాలముగా పిలువబడిన (నాయన) శబ్దము నిశ్శబ్దముగా నిలిచిపోయింది. శబ్దము నిశ్శబ్దమునుండి శబ్దమును వెలువరింపజేస్తే ఆ నిశ్శబ్దమునుండి వెలువడిన శబ్దము, శబ్దమయమును నిశ్శబ్ద మొనరించినది.

అంతకుముందు అరుణాచలేశ్వరుని రథమాగి " నాయన " రాకతోనే కదలుట ఆ వూరివారందరికి తెలిసినదే. ఇప్పుడు బ్రాహ్మణ, మౌనస్వామి నోటినుండి శబ్దము వెలువడుట.

ఇది నాయన, భగవాన్ చరిత్రలలో ముడివేసుకొని, పెన వేసుకు పోయిన మధురాను బంధమనోహర మధురస్మృతి.

నాయన ఆ స్వామికి " భగవాన్ రమణ మహర్షి " అని నామకరణం చేశారు. అందరినీ " భగవాన్ " అని పిలిచి అనుగ్ర హములు పొంది తరించమన్నారు. కాని, స్వార్థచింతనతో తన కెందుకులే అని అనుకోలేదు. మామూలు మానవుడు నా కెందుకులే అని అనేక విషయాలలో స్వార్థచింతనతో సాటి మానవులనుండి తప్పుకొని పోవడానికి యత్నిస్తాడు. కాని మహాత్ములు ''మనకందరకూ'' అనే విశాల దృక్పథంతో వ్యవహరిస్తారు.

ఆనాడు నాయన నామకరణం చేసివుండకపోతే ఈనాడు మనము "భగవాన్ రమణ మహర్షి" అని తెలుసుకొని, పిలుచు కుంటు వుండగలిగే వారమా? అలాగే భగవాన్ "నాయనా" అని పిలిచి వుండకపోతే మనము నాయనను "నాయన" అని పిలుచు కునేవారమా !

చిత్రాతిచిత్రం. శిష్యుడు గురువుకు నామకరణం చేయడం. మామూలుగా తల్లిదండ్రులు, గురుదేవులు పిల్లలకు, శిష్యులకు, నామకరణం చేస్తారు. కాని ఇక్కడ యిదొక విభిన్న పంథా. ఆ తర్వాత గురువు శిష్యునికి నాయన "నాయన" అని నామకరణం చేశాడు.

అక్కడ నుంచి మొదలైంది నాయన మరోజన్మ. అనేకానేక మహా మహిమోపేతములైన గ్రంథములు, దేశపర్యటనలు, తపస్సులు, ఆశ్రితుల నుద్దీపింపజేయడం. బ్రహ్మచర్యం, వానప్రస్థం సన్యాసం, వేద ధర్మాలు, వర్ణాశ్రమ ధర్మాలు, అధ్యయనములు ఉపన్యాసములు, శిష్యకోటి పరంపర, అన్నిటి మధ్య శ్రీ గురుని చల్లని నీడలో నిర్లిప్తత – ఇదీ నాయనను గురించి ముక్తసరిగా – అసంఖ్యాకములలో ఏ ఒకటో, రెండో విషయములు. దేవతలున్నారా? తపస్సు సాధ్యమా ! మంత్రాలకు చింతకాయలు రాలుతవా? మోక్షము సాధ్యమా? విఘ్నములను ఎదుర్కొనుట సాధ్యమా? జ్యోతిష్యము నిజమా ? గురువు అవసరమా ? శిష్యుని లక్షణ, లక్ష్య, ధర్మ, కర్మములేవి? బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసములు ఒక జన్మలోనే అనుభవించ వీలగునా ! దిక్కులేని వారికి దేవుడే దిక్కనెడి సామెత నిజమేనా? తల్లిదండ్రుల ఆచార వ్యవహార, సంకల్పములను బట్టి సంతానము ఎలా వుంటుంది ? శరణాగతి అంటే ఏమిటి ? ఆపదలలో నున్నప్పుడు శ్రీ గురుని కృప ఎలా శిష్యుని, ఆశ్రితుని అదృశ్యముగా కాపాడుతుంది? వీటన్నికి సమాధానములు "నాయన" ను గురించి అనేకులు వ్రాసిన అనేక చరిత్రలలో "భగవాన్" ను గురించి అనేకులు వ్రాసిన అనేకానేక గ్రంథములలో కొంతవరకు లభించవచ్చును.

ఆనాడేకాదు, ఈనాడు ఇకముందు కూడా ధ్యేయము బలముగా నుండిన సత్యాన్వేషణ తత్పరునకు గురువు అవసరము. శ్రీ గురునికి తనను అర్పించుకొన్న శిష్యుడు సదా శ్రీ గురుని శిక్షణలో పరిరక్షనలో సత్యములో లీనం కాగలడని అవగాహనకు వస్తుంది.

పాత్రతను బట్టి పాత్ర, పాత్రను బట్టి పదార్థము. యథా లాపంగా చదివినా, నాయన చరిత్ర పడుకున్నవాడిని కూర్చోబెట్టి ఆలోచింపజేస్తుంది. ఇంతకూ ఈ రాతకు ముగింపులేదు, వుండదు. కానీ ముగించక తప్పదు. సత్యధర్మములు స్థిరములు. అవి భరతమాత పాలిండ్లు. ఆ అమృతమును గ్రోల గలిగినవారు ధన్యులు. కానీ ఆ తల్లి సంస్కారాన్ని, శీలాన్ని సంస్కృతిని మాత్రం నశింప జేయకూడదని ప్రార్థన.

"నాయనే కాదు, ఎందరెందరో కొన్నికోట్ల సంవత్సరాలుగా మన తల్లిని గౌరవిస్తూ, తల్లికి నమస్కరిస్తూ తమ ధర్మాన్ని నెరవేర్చు కుంటున్నారు. వారికి అడ్డు పోకండి. ఒకరికి ఉపకారం చేయక పోయినా అపకారం చేయకుమనే సామెతనైనా గుర్తుంచుకోండి.

లేకుంటే తల్లిని తాకట్టు పెట్టే దౌర్భాగ్యులై, చివరకు అనాథలై దిక్కుతోచక దిక్కుకొకరుగా పరుగెడుతూ అలమటించాల్సిన దుర్గతి పట్టగలదని ఆర్యులు ఏనాడో హెచ్చరించారు. అలా జరిగిననాడు ఎవరికెవరు ? రక్షణ ?

వేద ధర్మములు, సంస్కారములు, సంస్కృతి, సాంప్ర దాయములకు, ఆచార వ్యవహారములకు వివరణలను కొంతవరకు తెలుసుకోగోరితే భగవాన్, నాయన, సాయి, వగైరా........పరమాత్మ స్వరూపుల చరిత్రలు చదవండి. రామాయణ. భారత, భాగవత, భగవతాది ధర్మసూక్ష్మములను తెలిపే పురాణములను చదవండి. మేల్కొండి అని ఘోషిస్తున్నాయి - సత్యాన్వేషణ తత్పరుల ఆవేదనలు. ఈ ఆవేదనల రోదనలెందుకని తామసులై వుందామో! లేక తాపసుల మౌదామో ! అటు యిటుగాక మధ్యన యిరుక్కు పోతామో ? వారివారి ప్రారబ్ధము శ్రీ గురుకృప దైవేచ్ఛ! లోకాస్స మస్తాస్సుఖినోభవంతు.

ఓమ్ తత్ సత్ !!

" ఓం నమో భగవతే శ్రీ రమణాయ "

" ఇంద్రో విశ్వస్య రాజతి "

# 1. అవతరణము

స్వధర్మము కొఱకు స్వరాజ్యము కావలెనని 1857 లో భారతీయులు బ్రిటిషు ప్రభుత్వముపై తిరుగుబాటు చేసిరి. అది విఫల మయ్యెను. తిరుగుబాటు దారులను శిక్షించు నెపముతో బ్రిటిషు వారు ప్రజలను పెక్కు విధముల హింసింప జొచ్చిరి. స్వరాజ్యము నెట్లయినను సంపాదించవలెనని అప్పుడు ఆసేతు హిమాచలముగా అనేకులు భావించు చుండిరి. అ గాఢ భావమునకు ఫలముగా వారి సంతతిగా దేశమందంతటను ఎందరో మహానుభావులు రాజకీయ ధార్మిక విద్యా రంగములలో ఉదయించి భారత దేశము నుద్ధరింప యత్నించిరి. అట్టి ధార్మిక వీరులలో ఎన్నదగినవాడు శ్రీ కావ్యకంఠ గణపతి ముని.

విశాఖపట్టణ మండలమున బొబ్బిలికి అరు మైళ్ళలో కలువరాయి అను గ్రామము కలదు. ఇందు "నవాబు అయ్యల సోమయాజుల" అను నింటి పేరుగల బ్రాహ్మణ కుటుంబము ఆ ప్రాంతమున ప్రఖ్యాతమై యుండెను. వీరు ఋగ్వేదులు; కౌండిన్యస గోత్రులు. సంస్కృతమున జానకీ పరిణయ మను నాటకము రచించిన రామభద్ర దీక్షితుడు ఈ వంశములోని వాడే. ఈ వంశమున జగన్నాథ శాస్త్రికి మామ గారి వలన కలువరాయి

గ్రామాధిపత్యము సంక్రమించెను. జగన్నాథ శాస్త్రి కుమారుడు భీమశాస్త్రి. భీమశాస్త్రికి నరసింహ శాస్త్రి, సర్వేశ్వర శాస్త్రి యను పుత్రులు కలిగిరి.

నరసింహశాస్త్రి కుటుంబమునకు, గ్రామమునకు అధిపత్యమును వహించుచు ఆయుర్వేద జ్యోతిష మంత్ర శాస్త్రము లందు విశారదుడై చుట్టు ప్రక్కల గ్రామములలో వ్యవహారవేత్తగా ప్రసిద్ధుడయ్యెను. శ్రీవిద్యా దీక్షను పొందిన వీరి వంశస్థులలో ఈయన యైదవ పురుషుడు. ఈయనకు డుంఠి గణపతి, భార్యయగు నరసమాంబకు సూర్యుడు ఇష్ట దేవతలు.

విప్లవము నాటికి నరసింహశాస్త్రి కుఱ్ఱవాడు. ఆ సమయమున ఈయన దేశ సంచారము చేయుచుండెను. విప్లవము నణంచు నెపముతో తెల్లవారు కావించుచుండిన ఘోర కృత్యములను దారి పొడవున చూచుచు ఈయన చాల ఖేదమును పొందెను. నాటినుండి దేశ స్వాతంత్ర్యము కొఱకు ప్రజల యభ్యుదయము కొఱకు ఈయన ఉపాయములను ఆలోచింప జొచ్చెను. వేద ధర్మము నుండి ప్రజలు జారుచుండుటయే వారి దౌర్బల్యమునకు దేశ దుర్గతికి హేతు వయ్యెనని ఆయన తలంచు చుండెను. కాని సనాతనమైన ధర్మమును నెలకొల్పుటకు తనకు శక్తి చాలదని అట్టి సామర్థ్యముగల పుత్రుని అనుగ్రహింపుమని ఆయన ఇష్ట దైవమైన గణపతిని ప్రార్థించు చుండెను. నరసమాంబ కూడ భర్తననుసరించి మంత్ర జప స్తోత్రములను ఆరాధనలను చేయ జొచ్చెను.

అప్పటికే వారికి భీమశాస్త్రి కలిగి యుండెను. వానికి రెండేండ్ల వయస్సులో పెద్ద జబ్బు చేసెను. పిల్లవాడు జీవించినచో అరసవల్లి క్షేత్రమున పుట్టుజుట్టు నిత్తునని తల్లి మ్రొక్కుకొనెను. బాలుడు బ్రతికెను. వానికి మూడవయేట మ్రొక్కు తీర్చుటకు ఈశ్వర సంవత్సర రథసప్తమినాడు (9–2–1878) తల్లిదండ్రులు బాలుని గైకొని అరసవల్లి కేగిరి. ఇది ప్రసిద్ధమైన సూర్య క్షేత్రము. మ్రొక్కు తీర్చిన తరువాత నరసమాంబ "తండ్రీ నీ కృపను ఇంతటితో ఆపకుము; దేశోద్ధారకుడైన పుత్రుని ప్రసాదింపు" మని సూర్య భగవానుని ప్రార్థించెను.

"వాసిష్ఠ వైభవమ్" లో నాలుగేండ్ల వయస్సుగల పుత్రునితో నరసమాంబ యొక్కతయే అరసవల్లికి పోయినట్లు చెప్పబడి యున్నది.*

పగలంతయు ఉపవాసము చేసి ఆ దంపతులు మంత్ర ధ్యానముతో గడపి రాత్రికి విశ్రమించిరి. నరసమాంబకు కలలో సూర్యాలయ ప్రాకారము యొక్క వెనుక భాగము నుండి యొక బంగారు వర్ణముగల స్త్రీ అగ్నిపూర్ణమగు బంగారు కలశమును గైకొని వచ్చి నవ్వుచు ఇచ్చి అంతర్ధానమైనట్లు కన్పించెను. అది విని నరసింహశాస్త్రి సంతోషముతో "ఆ కాంచనాంగి సూర్యశక్తి యగు హిరణ్మయి. ఆమె అగ్నిని ధరించును. ఆమె దానిని నీ చేతి యందుంచుట వలన నీకు అగ్ని యంశముతో పుత్రుడు కలుగునని తోచుచున్నది" అని ఆమెను అభినందించెను.

---

*(ప్రథమ ప్రకరణము – ప్రాదుర్భావము)

అట్లే ఆమె అక్కడి నుండి వచ్చిన తరువాత గర్భవతి అయ్యెను. ఏడవ మాసము రాగానే ఆమెను పుట్టింటికి పంపి నరసింహశాస్త్రి ఇష్ట దేవతానుగ్రహమును సంపాదించుటకు కాశికి పోయెను. అక్కడ ఆయన కార్తీక మాసారంభము నుండి ఢుంఠి గణపతి ఆలయములో పగలు ఉపవసించుచు రాత్రి పాలు త్రావుచు జపముచేయ జొచ్చెను. ఒకనాడు మధ్యాహ్నమున రెండు గంటలకు ఒక శిశువు గణపతి విగ్రహము నుండి వచ్చి అభిముఖముగా అంతర్ధానమైనట్లు ఆయనకు గోచరించెను. ఆ దేవుని యనుగ్రహమున తనకు పుత్రుడు కలిగి యుండునని తలంచి సంతోషించుచు ఆయన అత్తవారింటికి వచ్చెను. తన యొద్దకు దివ్య శిశువు వచ్చిన సమయముననే బహుధాన్య కార్తీక బహుళాష్టమి యందు భానువాసరమున 17-11-1878 మఖా నక్షత్ర ప్రథమ పాదమున పుత్రుడు కలిగెనని చెప్పిరి. పుట్టిన బిడ్డచుట్టు దివ్యమైన తేజస్సు తనకు గోచరించెనని నరసమాంబ చెప్పెను. అందరును సంతోషించిరి. తమ యిష్ట దేవతల నామములతో దంపతులు పుత్రునకు సూర్య గణపతి శాస్త్రి అని నామకరణ మొనరించిరి.

దైవాంశసంభూతు డయ్యును బాలుడు దివ్యలీలలను ప్రదర్శింపక పోగా రోగగ్రస్తు డగుట బంధువుల పరిహాసమునకు తల్లిదండ్రుల పరితాపమునకు కారణ మయ్యెను. ఆరేండ్లు వచ్చినను బాలునకు మాటలు రాలేదు. ఎన్నో చికిత్సలను చేసి విసిగి తుదకు నరసింహశాస్త్రి వానికి కాల్చిన లోహమును నాడీ బంధము నందు తాకించెను. అడ్డు తొలగించి నంతనే ఉబికివచ్చు ప్రవాహము

వలె బాలునకు మాటలు పుష్కలముగా వచ్చెను. అది ఆశ్చర్య కరమై అందరును బాలుడు దైవాంశ సంభూతుడని నమ్మిరి. పిల్ల వాడు ఏకసంథాగ్రాహియై పినతండ్రియైన ప్రకాశశాస్త్రియొద్ద కొలది దినములకే బాల రామాయణమును, శివ సహస్రమును కంఠస్థము గావించెను. గణపతి పది యేండ్ల ప్రాయముననే కావ్యములను పఠించుచు గణిత శాస్త్ర గ్రంథములను కైవసము చేసికొని పంచాంగ గణనమున శుద్ధి ప్రకరణము అనునొక పథకమును రచించి గురు వునకు గురు వయ్యెను. సిద్ధ జ్యోతిష్కుడని బాలుని కీర్తి ప్రస రించెను. అప్పుడే ఇతడు ఒక్క గంటలో ముప్పదినాలుగు శ్లోకములతో "పాండవ ధార్తరాష్ట్ర సంభవ" మను ఖండ కావ్య మును రచించెను.

గణపతి తరువాత నరసమాంబకు అన్నపూర్ణ, శివరామ శాస్త్రి కలిగిరి. తరువాత మూడేండ్లకు నరసమాంబ గర్భవతియై ప్రసవించుటకు ముందు 'నాయనా! ఇప్పుడు పురుడు వచ్చిన వారికి ఎట్లుండును?' అని గణపతి నడిగెను. 'అమ్మా! ఇప్పుడు పురుడు వచ్చిన వారు మరణింతురు' అని గణపతి నుండి వాక్కు బాణము వలె వెలువడెను. అట్లే ఆమె కవల పిల్లలను ప్రసవించి వారితో స్వర్గస్థురాలయ్యెను. బాలుని వాక్కు అమోఘమై ఆమె మృతికి కారణ మయ్యెనని లోకులు ఘోషించిరి. అది విని గుండె జల్లుమన గణపతి మౌనముద్ర నవలంబించి జడునివలె అయి మరల అందఱకు ఆందోళనము కలిగించెను. రెండు నెలలు అట్లుండి పిదప యథాప్రకారముగా అతడు మేధా విజృంభణముతో కావ్య పాఠములను కొనసాగించెను.

బంధువుల యొత్తిడి వలన నరసింహశాస్త్రి గణపతికి పండ్రెండవ యేటనే ఎనిమిదేండ్లు నిండని విశాలాక్షి నిచ్చి వివాహ మొనర్చెను. గణపతి భార్య నుద్దేశించి 'మేఘ దూతము' ననుకరించుచు 'భృంగదూత' మును రచించెను. కాని కాళిదాసుని కవిత్వమునకు అది చాల తక్కుగా నున్నదని దానిని చించివేసెను.

పదునెనిమిదవ యేడు వచ్చునప్పటికి గణపతి వ్యాకరణాలంకార శాస్త్రములను సాధించుచు రామాయణ భారతాది పురాణేతిహాసము లందు పారగు డయ్యెను. పురాణ పఠనము వలన గణపతి తానుకూడ ఋషులవలె తపస్సు చేసి శక్తులను పొంది లోకము నుద్ధరింప వలయునని తలంచు చుండెను. తండ్రి వలన పదమూడవ యేటనే అతడు పంచాక్షరి మొదలుగా పండ్రెండు మహామంత్రములను పొందెను. అప్పటి నుండి తపస్సు చేయుటకు తగిన దేశ కాలమును గూర్చి ఆలోచింప జొచ్చెను. కోడలిని కాపురమునకు తెచ్చుటకు తల్లిదండ్రులు యత్నించు చుండగా అతడు ఒక నిబంధనముపై అందులకు అంగీకరించెను. ఆరు మాసములు తాను ఇంటియొద్ద నుండుటకు ఆరు మాసములు తపోయాత్రకు పోవుటకు తన భార్య అంగీకరింపవలయునని అతడు చెప్పెను. విశాలాక్షియు తనకు ఒకరిద్దరు పుత్రులు కలిగిన తరువాత తాను కూడ తపస్సు చేయుటకు భర్త అంగీకరింప వలయునని తెలిపెను. ఇద్దరు సరి వుజ్జీలుగా నున్నారని అందరు సంతోషించిరి. అత్తవారింటికి వచ్చి ఆమె భర్తవద్ద మహాగణపతి మంత్రమును శ్రీవిద్యాదీక్షను గైకొనెను.

## 2. కావ్యకంఠ బిరుద సత్కారము

గణపతికి తపస్సు చేయవలయునను కాంక్ష తీవ్రమయ్యెను. శ్రావణ మాసము నోములకు భార్యను పుట్టింటివారు తీసికొని పోవుట మంచి యవకాశముగా భావించి గణపతి యొకనాడు రహస్యముగా వేంకటశాస్త్రి యను మిత్రునితో అన్నయైన భీమ శాస్త్రితో బయలుదేరి 1896 వ సంవత్సరం అగస్టు నెలాఖరుకు రాజమహేంద్రవరమును చేరెను. భీమశాస్త్రి జంకుతో ఇంటికి తిరిగి వచ్చెను. గణపతి వేంకటశాస్త్రితో కోనసీమలో పేరమ్మ యగ్రహారమున కౌశికీ నది యొడ్డున తపస్సునకు ఉపక్రమించెను. సుమారు రెండు మాసములు దీక్షతో శివ పంచాక్షరి, మహాగణపతి మంత్రములను జపించినను అతనికి ఫలితము కన్పింప లేదు. కొన్ని దినములకు వేంకటశాస్త్రి కూడ వెడలిపోయెను. గణపతి కాశికి పోదలచి నంది గ్రామమునకు చేరి అచ్చట జ్యోతిష ప్రజ్ఞ చేత ధర్మశాలాధికారియైన కృష్ణమ్మనాయుని యభిమానమునకు పాత్రుడయ్యెను. అతడు నరసింహశాస్త్రిని పిలిపించి తండ్రి కొడుకుల నిద్దఱను సత్కరించి, ఏబది రూప్యములను వార్షికముగా నిచ్చుచు యాత్రలకు తోడ్పడుదునని అప్పటికి వారిని వెనుకకు పంపెను.

కలువఱాయిలో ఒకనాడు గణపతి ధ్యాన నిమగ్నుడై యుండగా పెద్ద గడ్డముగల యొక పురుషుడు తెల్లనివాడు గోచరించి 'నేను నీకు తపస్సఖుడను, భద్రకుడను; నీవు గణకుడవు' అని ప్రబోధించెను. ఈ విషయమును గణపతి తండ్రికి చెప్పెను. ఆయన తపస్సునకు అనుమతిని ఇచ్చుచు, ఆ సమయమున

విశాలాక్షి పుట్టింటిలో నుండవలెనని, తాను కోరినంతనే గణపతి తపస్సును వీడి రావలయునని, రెండు నిబంధనములను వీర్పఅచెను. గణపతి అందులకు అంగీకరించి తన యిరువదియవ జన్మదినమునకు మఱునాడు 18-11-1897 వ తేది తండ్రి యాశీస్సులతో ప్రయాగకు పోయెను.

ప్రయాగలో శంఖ మాధవాలయమున హంసతీర్థము నందు గణపతి కొన్ని దినములు తపస్సు చేసి పుష్య మాసములో సూర్య గ్రహణమునకు కాశికి బయలు దేరెను. కాశిలో తండ్రికి మేనమామ యైన ఆర్య సోమయాజుల భవానీ శంకరము యొక్క ఇంటియందు కాలము గడుపుచు గణపతి దర్భాంగ సంస్థానమున పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడైన శివకుమార పండితుని దర్శించి, అయనను కవితా వైభవముచేత పాండిత్య ప్రకర్షచేత ముగ్ధుని గావించెను. అయన గణపతిని నవద్వీపమున జరుగు విద్వత్పరీక్షకు పొమ్మని ప్రోత్సహించుచు అచ్చటి కార్య నిర్వాహకవర్గ కార్యదర్శికి పరిచయ పత్రము నొసంగెను.

పిదప ఒకనాడు గణపతికి సోమయాజుల సూర్యనారాయణ అను యోగి కన్పించి, ‘భద్రకాదులము మనము పదునార్గురము లోక కార్యము కొఱకు జన్మించితిమి. ఒక్కొక్కరము ఒక్కొక్క కార్యము నందు ప్రీతితో నున్నాము. నేను సుకేతుడను. నీవు గణకుడవు. నీకు విహితమైన కార్యమును స్థూల శిరస్సు తెలుప గలడు’ అని వెడలిపోయెను. రాత్రి కలయందు ఒక బ్రాహ్మణుడు కన్పించి నాసికయందు తపస్సుచేయుమని గణపతిని ప్రబోధించెను.

గణపతి నాసికనుండి త్ర్యంబకము మీదుగా కుశావర్తమునకు చేరి పదునాల్గు దినములు నీలాంబికాలయమునందు తపస్సు చేసెను. అచ్చట రామభావు అనువానితో పరిచయ మేర్పడి, వాని ప్రేరణమున గణపతి మొదటి సారిగా అష్టావధాన మొనర్చెను. పిమ్మట అతనితో నాసికకు తిరిగివచ్చి గణపతి అచ్చట తపస్సునకు యోగ్యమైన స్థలమును వెదకుటకు ఒంటరిగా బయలు దేరెను. అట్లు వెదకుచు గణపతి లక్ష్మణాలయమున ప్రవేశించెను. అప్పుడది నిర్జనమై యుండెను. ద్వారము దాటినంతనే కోవెల పూజారి గణపతిని దొంగ యనుకొని జుట్టు పట్టుకొని గ్రామాధికారి యొద్దకు ఈడ్చుకొని పోజొచ్చెను. అంతకు పూర్వము పండిత గోష్ఠిలో గణపతిని చూచియున్న యొక వ్యక్తి ఎదురై పూజారిని మందలించి అతనిని విడిపించెను. పూజారి తన తప్పును ఒప్పుకొన లేదు. గణపతి క్రుద్ధుడై నాసిక ధ్వంస మగునట్లు శపించెను. పిదప శాంతించి అతడు ఆ పరిసరముననె 'నవచూతి' అను స్థలమున డెబ్బది దినములు ఘోర తపస్సును చేసెను. ఒక దిగంబరుడు తెల్లనివాడు కలలో కన్పించి ఆంధ్ర భాషలో ఇంటికి పొమ్మనెను. శాపము వలన పూజారి కుటుంబము మొదలుగా నాసిక నగరము మారీ జ్వరముతో తుఫానుతో ధ్వంస మయ్యెను.

గణపతి కలువరాయికి తిరిగివచ్చి కొన్ని నెల లుండెను. విశాలాక్షి గర్భవతి యయ్యెను. గణపతి మరల బయలుదేరి భువనేశ్వర క్షేత్రమున కేగి తొమ్మిది దినములు తపస్సు చేసెను. తుది దినమున రాత్రి గణపతికి భువనేశ్వరి సాక్షాత్కరించి బంగారు గిన్నెతో తేనెను త్రావించెను. అప్పుడతడు వెన్నెలలో ఒక రాతిపై

కూర్చుండి యుండెను. పెదవి తడుముకొనగా అతనికి తేనె పెదవుల నంటుకొని యుండెను. అందువలన అది కల కాదు. అనాటి నుండి అతని బుద్ధియందు సూక్ష్మత్వము, కవిత్వము నందు మాధుర్యము అతిశయించెను. నాల్గు మాసములు అక్కడనే అతడు తపస్సును కొనసాగించెను.

14-2-1899 తేది విశాలక్షమ్మ పుత్రుని గనెనని యుత్తరము వచ్చినంతనే బయలుదేరి గణపతి విరజాపుర మందు కొంత కాలము తపస్సు చేసి కలువఱాయి చేరెను. కుటుంబ పోషణకు ఉద్యోగ ప్రయత్నము చేయుచు గణపతి పర్యటించుచు కేశినకొఱ్ఱు అగ్రహారమున ఒక పండితుని యొద్ద రెండు మాసములలో తర్క వేదాంత శాస్త్రములను పఠించెను. తరువాత నతడు కలువఱాయికి వచ్చి మూడు నాలుగు మాసములలో వ్యాకరణ మహాభాష్యమును నీతి శాస్త్రాది గ్రంథములను పఠించెను.

1900 వ సంవత్సరమున ఉగాదికి గణపతి మందసా సంస్థానాధిపతిని దర్శించి అష్టావధానము గావించెను. అచ్చట రాజ గురువును వాదమున జయించి రాజకుమారునకు శివపంచాక్షరి నుపదేశించి కొన్ని నెల లుండెను. ఇంతలో నవద్వీప మందు విద్వత్పరీక్షలు జరుగబోవుచున్నవను వార్త వచ్చెను. రాజు ప్రోత్సహింపగా గణపతి నవద్వీపమునకు చేరెను. అచ్చట నతడు శివకుమార పండితుడు ఇచ్చిన పరిచయ లేఖ వలన కార్యదర్శియైన శితికంఠ వాచస్పతి యొక్క ఆదరమునకు పాత్రుడై అతని యింటనే బస చేసెను.

పాండిత్యమున ఆశు కవిత్వము నందు ఉత్తర దేశమున అద్వితీయుడుగా ప్రసిద్ధుడైన అంబికాదత్తుడు ఆ సంవత్సరము పరీక్షలకు అధ్యక్షుడుగా నుండెను. సభలో ప్రవేశించుచు గణపతి అధ్యక్షుని చూచి చాపలముతో 'ఈయన ఎవరు' అని వాచస్పతిని పెద్దగా అడిగెను. అధ్యక్షుడు ఆ మాట విని చిరునవ్వుతో 'శ్లో॥ సత్వర కవితాసవితా, గౌడోఽహం కశ్చిదంబికా దత్తః।' (సత్వరముగా కవిత్వమును చెప్పగల గౌడుడను అంబికాదత్తుడను) అని శ్లోకమున సగము చెప్పెను. వెంటనే 'గణపతి రితి కవి కులపతి, రతిదక్షో దాక్షిణాత్యోఽహమ్॥' (నేను గణపతి అను కవి కులపతిని, అతి దక్షుడను, దాక్షిణాత్యుడను) అని గణపతి శ్లోకమున ఉత్తరార్ధమును పూరించెను. అంతటితో నూరకుండక గణపతి 'భవాన్‌దత్తః అహం త్వౌరసః' (మీరు అంబికకు దత్త పుత్రులు; నేను ఔరసుడను) అనెను. ఎల్లరును బాల పండితుని సాహసమునకు నివ్వెఱపడిరి. అంబికాదత్తుడు గణపతిని వేదికపైకి ఆహ్వానించి పరంపరగా నాలుగు సమస్యల నిచ్చెను. అడిగినదే తడవుగా అన్నింటిని గణపతి అద్భుతముగా పూరించెను. తరువాత వారి కిరువురకు స్పర్థతో వివాదము విజృంభించెను. తుదకు కవిత్వ పటుత్వమునకు నిరర్గళధారకు అంబికాదత్తుడు సంతోషించి గణపతిని కౌగిలించుకొని యభినందించెను. పిదప పరీక్షకుల యభిమతము ననుసరించి గణపతి పదునెనిమిది శ్లోకములలో భారత కథను సరసముగా ఆశువుగా చెప్పెను. అధ్యక్షు డంతటితో పరీక్షను నిలిపి గణపతికి "కావ్యకంఠ" బిరుదము నొసంగవలయునని ప్రకటించెను. అట్లే ఆ విద్వత్పరిషత్తువారు 20-6-1900 తేది కావ్యకంఠోపహార ప్రశంసా పత్రము నొసంగి గణపతిని మిగుల సమ్మానించిరి.

# 3. బ్రాహ్మణస్వామి దర్శనము

బిరుద విభ్రాజితుడై గణపతిశాస్త్రి వైద్యనాథ క్షేత్రమున కేగి తపస్సును చేయుచు సురేశ మిత్రుడను పండితుని వలన తారా మంత్రోపదేశమును పొంది, మహాదీక్షతో జపించి మంత్రసిద్ధి నొందెను. పదవనాటి రాత్రి కలలో శివుడు కన్పించి నిర్విషయ ధ్యానరూప మైన స్మృతి మార్గమును చూపి కావ్యకంఠునిపై విభూతిని చల్లి మాయమయ్యెను. తరువాత కావ్యకంఠుడు 'గహ్వాల' (గద్వాల) సంస్థానాధిపతిని దర్శించి చతురంగమున ఆయన యొద్దనున్న యష్టదిగ్గజములవంటి వారిని ఓడించెను. ఆయన పళ్లెరము నిండ రూప్యముల నుంచి నమస్కరించినను కావ్యకంఠుడు పవిత్ర మనస్కు లకు అత్యాశ తగదని మార్గ వ్యయమునకు కావలసిన పది రూప్య ములను మాత్రమే స్వీకరించెను. ఆ ధనముతో ఆయన కాశికిచేరి, అటునుండి కాన్పూరునకు పోయెను. అక్కడ మూడు మాసములు స్మృతి మార్గము నవలంబించి ఆయన జపధ్యానములు సలిపెను.

అప్పుడు ఇంటికి రమ్మని తండ్రి వ్రాయగా కావ్యకంఠుడు వెంటనే కలువరాయికి చేరెను. నేత్ర వ్యాధితో బాధపడుచున్న తండ్రికి సేవ చేయుచు ఆయన అచ్చటనే పదునైదు మాసములు వుండి, ఆయుర్వేదమును మథించి చికిత్స చేసి ఆయనకు దృష్టి చక్కబడునట్లు చేసెను.

తండ్రి యభిప్రాయమును అనుసరించి గణపతిశాస్త్రి భార్యతో కూడ 1902 మార్చి నెలలో నందిగ్రామము మీదుగా మందసా చేరి అచ్చట రాజకుటుంబము యొక్క ఆతిథ్యమును

పొందుచు సుమారు మూడు నెలలుండెను. విశాలాక్షమ్మ అనారోగ్యము వలన పుట్టింటి కేగెను. కావ్యకంఠుడు సోదరుడైన శివరామశాస్త్రిని పిలిపించుకొని వాడితో భువనేశ్వరమున కేగి దేవిని ఒక మాసము అరాధించెను. అటనుండి ఆయన తమ్మునితో దంతవాణీ సంస్థానమును దర్శించి కలకత్తాకు పోయి వెనుకకు మరలి కాంచీనగరమునకు చేరి క్షీరవతీ, వేగవతీ నదుల మధ్యనున్న హనుమదాలయమున శివ పంచాక్షరిని ఒక నెల జపించెను. అక్కడ నారాయణుడను జ్యోతిష విద్వాంసుడు శిష్యుడయ్యెను. అతని మాటను పాటించి గణపతి తేజోలింగ క్షేత్రమైన అరుణాచలమునకు వచ్చెను.

అప్పుడు గణపతినవరాత్రుల యుత్సవములు జరుగుచుండెను. అందువలన పురము కోలాహలముతో నుండెను. కావ్యకంఠుడు మొదట అపీతకుచాంబా దేవిని దర్శించి, పిదప అరుణాచలేశ్వరుని సేవించెను. అప్పుడాయనకు భక్తియొక్క ఉద్రేకమున అపూర్వమైన యనుభవము కలిగి, "శక్తి, ఈశ్వరుడు ఇచ్చటనే నాకు పూర్ణానుగ్రహ స్వరూపులై కన్పించు చున్నారు. నా తపస్సు ఇక్కడనే సిద్ధి పొందును" అని ఆయన సోదరునకు చెప్పెను. శివరామశాస్త్రి కూడ అన్నతో అక్కడనే యుండుటకు నిశ్చయించుకొనెను. కాని వారి కచ్చట భోజనప్రాప్తి దుర్ఘటమయ్యెను. గణపతికి క్షేత్ర దేవతలపై కోపము వచ్చెను. అప్పుడు వారికి విచిత్రమైన యాతిథ్యము లభించెను. ఒక బ్రాహ్మణుడు కన్పించి తన భార్యయొక్క వ్రత పారణము కొఱకు వారి నిద్దరను ఆహ్వానించి అతిథ్యము నొసంగెను. వారు ఆ రాత్రి సుఖ

ముగా నిద్రించి లేచునప్పటికి తాము ఆతిథ్యము పొందిన గృహము మాయమై దాని స్థానమున గణపతి దేవాలయము నొద్ద బయలు ప్రదేశము కన్పించెను. అది స్వప్న మనుకొనుటకు వీలు కాకుండా ఆ దంపతులొసంగిన తాంబూలములు గుర్తుగా కన్పించుచుండెను. కాంచీపురమందు గావించిన జపముతో శివ పంచాక్షరికి అయిదు కోట్లజపము పూర్తియగుటవలన అపీతకుచాంబ అరుణాచలేశ్వరుడు అనుగ్రహించి తమ్ము అచటికి ఆకర్షించి ఆతిథ్యము నొసంగిరని గణపతి భావించుచు, తల్లిదండ్రుల యొడిలో చేరిన బాలునివలె ఆనందించెను.

అరుణాచలమున నివసించుచు అన్నము కొఱకు లోకులను యాచించుటకంటె పరమేశ్వరుని ప్రార్థించుటయే మేలని కావ్యకంఠుడు వేయి శ్లోకములలో హరస్తుతిని గావింప బూనుకొనెను. అశ్వయుజమున దేవీ నవరాత్రులైనంతనే 1902 అక్టోబరులో గ్రంథమును అరంభించి కావ్యకంఠుడు కార్తిక మాసమున కృత్తికోత్సవమునకు ముందే ముగించెను. ప్రతిదినము వ్రాసిన శ్లోకములను ఆయన సాయంకాలము నంది ముందు నిలుచుండి ఈశ్వర సన్నిధియందు వినిపించుచుండెను. పౌరులు ఆశ్చర్యచకితులై విన జొచ్చిరి. తుది దినమున శేషాద్రిస్వామి, బ్రాహ్మణస్వామియు వచ్చి విని ఆనందించిరి. గ్రంథము ముగియునప్పటికి ఈశ్వరానుగ్రహమున కావ్యకంఠునకు పాఠశాలయందు అధ్యాపకపదవి లభించెను. పది దినములలో ఆయన తమిళమును అభ్యసించి ఆ భాషలో విద్యార్థులకుబోధింపజొచ్చెను. కాని ఈశ్వరానుగ్రహము తనకు సమగ్రముగా లభింపలేదని, ఆత్మానందము గోచరించుట లేదని ఆయన

పరితపించుచుండెను. 1903 జనవరిలో ఒకనాడు బ్రాహ్మణ స్వామిని దర్శించినచో తనకు ధన్యత్వము కలుగవచ్చునని కావ్యకంఠునకు తోచెను. వెంటనే విశ్వనాథయ్యరు అను పరిచితునితో కొండపైనున్న యాస్వామి యొద్దకుపోయెను.

బ్రాహ్మణస్వామి 1-9-1896లో తిరుచ్చుళి నుండి అచ్చటికి వచ్చి అనేక స్థలములలో గాఢ సమాధియందుండి జ్ఞానిగా జనులచే గుర్తింపబడి సేవింపబడుచున్నను మౌనము నవలంబించి యుండెను. అప్పటివఱకు అయనవాక్కు ఎవని విషయమునను ప్రసరింపలేదు.

వీ రిరువురు విరూపాక్ష గుహలో స్వామినిగానక పద్మనాభాశ్రమమునకు పోయిరి. అచ్చట నొక ఱాతిపై బ్రాహ్మణస్వామి కూర్చుండియుండెను. అయనను చూడగానే కావ్యకంఠుడు దుర్గామందిరయోగి చెప్పిన స్థూలశిరస్సు ఇతడే యని గుర్తించి ఆయన యందున్న యోజస్సునకు అశ్చర్యపడి చేతులు జోడించి నమస్కరించెను. అశ్రమ ముఖమున పద్మనాభస్వామి అను జటాధారి వ్యాఘ్రాసనముపై కూర్చుండియుండెను. విశ్వనాథయ్యరు ఆ జటాధారిని గూర్చి కావ్యకంఠునకు ఎంతో ప్రశంసించి చెప్పెను. కాని కావ్యకంఠుడు అతనిని తేజోహీనునిగా గమనించి నమస్కరింపక కూర్చుండెను. అ యవినయమునకు జటాధారి కినుక నొందియు గడ్డమును సవరించుకొనుచు, "గణపతిపరమైన "శుక్లాంబరధరమ్" అని మొదలగు శ్లోకమును విష్ణుపరముగా మీారు చెప్పగలరా?" అని కావ్యకంఠుని ప్రశ్నించెను. అయన కోపముతో ఆ శ్లోకమును

విష్ణుపరముగా వివరించి బ్రాహ్మణస్వామి పరముగాకూడ వ్యాఖ్యా నించెను. బ్రాహ్మణస్వామి చిరునవ్వుతో గణపతిని అభినందించెను. అయినను ఆ స్వామిని ఆశ్రయింపవలెనను తలంపు అప్పుడు ఆయనకు కలుగలేదు. వారు తిరిగి వచ్చిరి.

అప్పటికి బ్రాహ్మణస్వామి వయస్సు సుమారు 22 ఏండ్లు. ఆయనకు కాషాయము దండ కమండలములు లేవు. కాబట్టి ఆయన సన్యాసి కాడు. బ్రహ్మచారి యని తలంచుటకు యజ్ఞోపవీతము లేదు. తత్త్వజ్ఞుడు అనాచారముతో నుండునా? లోకహితమునకు అవతరించిన స్థూలశిరస్సు అయినచో దుర్గా మందిరయోగివలె తన్ను పలుకరింపడా? అని పెక్కు సందేహములతో కావ్య కంఠుడు ఆ స్వామి విషయమున అప్పుడు శ్రద్ధ వహింపలేదు. ఆయన తిరిగివచ్చి హరస్తుతివలన హరుని దర్శనముకాని, సంపూర్ణ మైన యనుగ్రహముకాని కలుగలేదని నిర్వేదముతో ఆ గ్రంథము చింపివేసెను, కల్పట్ రామస్వామి అను శిష్యుడు దీనికొక ప్రతిని వ్రాసికొనియుండెను. కాని ఆయన అకస్మికముగా మరణించెను. ఆ ప్రతి దొరకలేదు.

# 4. కవితా వైభవము

గణపతిశాస్త్రి అప్పటికి వేదాధ్యయనము గావింపలేదు. ఆ కొఱతను తీర్చుకొనుటకై ఆయన వేద పాఠశాలలోని యొక పండితుని యొద్ద ఒక సంవత్సరములో వేదమును అధ్యయన మొనర్చెను. పిమ్మట సాయణాచార్య భాష్యముతో వేదార్థమును గ్రహించి గురువునకే బోధించెను.

"వాసిష్ఠ వైభవము" నందు పుత్రునకు ఉపనయనము చేసిన తరువాత వేలూరునందే నాయన ఋక్ సంహితను అధ్యయనము గావించి సాయణభాష్యమును పరిశీలించి నట్లున్నది. "వత్సస్య మహాదేవస్య ఉపనయన మహోత్సవాయ గృహంగత్వా, తతో ఽరుణాచల మేత్య మహర్షే రాశిషం ప్రాప్య పుత్రకస్య బ్రహ్మణ్యం సంస్కారం నిరవర్తయమ్ ... ఋక్సంహితాం సస్వరాం వేలూరుపుర ఏవ అశిక్షే సావధానం సాయణీయ భాష్యంచ సమాలోకిషి॥"*

క్రమక్రమముగా కావ్యకంఠుని కీర్తి ప్రసరించి ఆయనను దర్శించుటకు అనేకులు రాజొచ్చిరి. ఒకనాడు చెన్నపురి హైకోర్టులో గుమాస్తాగా ఉన్న శాతంజేరి రామస్వామి అయ్యరు వచ్చెను. తన తాతయైన ఉపనిషద్బ్రహ్మమే గణపతిశాస్త్రిగా అవతరించెనని అతనికి తోచెను. వెంటనే అతడు గణపతిశాస్త్రికి పాదాభివందనము గావించి శిష్యుడయ్యెను. అతని ప్రేరణమున కొన్నాళ్ళకు కావ్యకంఠుడు చెన్నపురమునకేగెను. అక్కడ హైకోర్టు వకీలుగా ఉన్న పంచాపకేశశాస్త్రి తనతోకూడ వేదము వేంకటరాయశాస్త్రిని,

---

*16. ప్రకరణం – 166

తండులం సుబ్రహ్మణ్య అయ్యరును గైకొని వచ్చి కావ్యకంఠుని దర్శించెను. ఆయన వేంకటరాయశాస్త్రిగారి సందేహములను తీర్చి ఆశువుగా శ్లోకములను చెప్పి వారి ప్రశంసకు పాత్రుడయ్యెను. రంగయ్యనాయుడు అను తెలుగు పండితుడు ఒక పురాతన వైద్య గ్రంథము తీసికొని వచ్చెను. దాని నొక్క గంటలో పరిశీలించి రంగయ్య సంశయముల కన్నింటికి ఆయన సమాధానములు చెప్పెను. పిమ్మట ఆయన అన్నామలైకి మరలి వచ్చెను.

నరసింహశాస్త్రి నేత్రరోగచికిత్స కొఱకు చెన్నపట్టణమునకు వచ్చి యటనుండి తిరువణ్ణామలైచేరి బ్రాహ్మణస్వామిని దర్శించెను. పాఠశాలలకు సెలవులిచ్చినంతనే గణపతిశాస్త్రి తండ్రిని గైకొని చెన్నపురమునకు వచ్చి ఆయనను కలువఱాయికి పంపి తాను రామస్వామి యింటికి పోయెను. అక్కడ పెక్కుమంది ఆయనను దర్శించుటకు వచ్చుచుండిరి. ఆ యిల్లు చాలక అయన బసను దొరస్వామి అను విద్యార్థి ఇంటికి మార్చెను.

ఒకనాడు తోడి విద్యార్థులతోకూడి దొరస్వామి ఆయనతో మాటలాడుచు షేక్స్పియర్ రచించిన ''మాక్బెత్'' నాటక కథను చెప్పెను. కావ్యకంఠుడు వెంటనే "డంకన్ నామ మహీపతిస్సమ భవత్" అని ఆరంభించి ఆ కథను కావ్యముగా అనర్గళముగా చెప్పెను. పిమ్మట ఒక విద్యార్థి ఆంగ్ల వార్తాపత్రికలోని కొన్ని పంక్తులను చదివి వినిపించగా కావ్యకంఠుడు ఆ పంక్తుల నన్నింటిని మరల చదువుటయేకాక తుదినుండి మొదటికి కూడ చదివి వారిని ఆశ్చర్యపరవశుల గావించెను. దొరస్వామి భక్తి

పారవశ్యమున లేచి ఆయనకు పాదాభివందనము గావించెను. అప్పుడు ఆయన అతనిని పూర్వజన్మ కింకరుడైన సుధన్వునిగా గుర్తించెను.

విద్యార్థులు, పౌరులు కావ్యకంఠుని సమ్మానించుటకు పూను కొనిరి. ఆ సమయమునకు "బాలసరస్వతి", "భట్టశ్రీ" బిరుదములు గల సుదర్శనుడు అను సుప్రసిద్ధ పండితుడు అచ్చటికి వచ్చెను. ఆయనకుకూడ సమ్మానము కావింప వలయునని కొందఱు పట్టు పట్టిరి. సమ్మానసభవారు ఒక బంగారు తోడాను చేయించి ఇరు వురిలో వాదమున జయించినవానికి దానిని బహూకరింప నిశ్చ యించిరి. ఈ లోపల తిరువళిక్కేణి పాఠశాలలో ఏర్పాటు చేయబడినసభలో కావ్యకంఠుడు వేదము వేంకటరాయశాస్త్రి మొద లగువారు ఇచ్చిన యేబది సమస్యలను వెంట వెంటనే పూరించి సమ్మానింపబడెను.

భట్టశ్రీ కావ్యకంఠుల వివాదసభ కృష్ణస్వామి అయ్యరు అధ్యక్షతయందు మైలాపూరులో జరిగెను. అందు కావ్యకంఠుడు విజేతయై "తోడా" ను పొందెను. మఱియొక సభయందు భట్టశ్రీ అధ్యక్షుడుగా నుండి కావ్యకంఠుని అవమానించుటకు కుతంత్ర మును పన్నెను. కావ్యకంఠుడు భట్టశ్రీయొక్క దౌర్జన్యమును, మోసమును పాండిత్య హీనతను నిరూపించి మహాజనుల యభినందనములకు పాత్రుడయ్యెను.

# ౫. దేశోద్ధరణ కాంక్ష

శంకరశాస్త్రి అను వ్యక్తికూడ కావ్యకంఠునిచే తనకు పూర్వ జన్మ కింకరుడుగా గుర్తింపబడి దొరస్వామికి తోడయ్యెను. వీరిద్దఱి వలన విద్యార్థులు గుంపులు గుంపులుగా ఆయనవద్దకు వచ్చు చుండిరి. వారు ఆయనను సముద్రతీరమునకు తీసికొనిపోయి దేశోద్ధరణమునకు ఉపాయములను చర్చింపజొచ్చిరి. ఆయన వారికి వేద రహస్యముల యుత్కృష్టతను, ఋషుల తపశ్శక్తుల మహిమలను బోధించుచు నిట్లు చెప్పుచుండెను. "...... సన్యాసి వేషములు బుద్ధునికాలమునుండి మన కొంప ముంచినవి. కాషాయ ముండనములందున్న మన గౌరవమును జూచి మన కన్నివిధముల క్షౌరమొనర్చుట కితర దేశస్థులు పరంపరలుగా మనదేశమును కొల్లగొట్టిరి. శుష్క వైరాగ్యము నాశ్రయించిన ఈ వేషధారులు మనసంఘమధ్యమందే నిర్వ్యాపారులై విహరించుచు తమ కుక్షి కొఱకు మన కుక్షులను హరించుచున్నారు. వీరియం దనాదరణము జూపియైన వీరిని గార్హస్థ్యమునకు మరల్చుట మన జాతి కవసర మగు ప్రథమ సంస్కారము. రెండవది గోచి గావంచా సాంప్ర దాయము లెట్టితర దేశస్థులచే మనయందు పరిహసింప బడు చున్నవో గుర్తించి మనలను నవ్వులపాలు చేయని విధమున సాంప్రదాయములను సంస్కరించుకొనుట. అట్లే మన కాదర్శ ప్రాయులైన ఋషులను నీచపరచు విధమున అల్లబడిన దుష్ట కథలను పురాణములనుండి, కావ్యప్రబంధ నాటకాది గ్రంథముల నుండి తొలగించి యట్టిధోరణిని కవులందు నిరసించుట మూడవది. మన జాతియందు వీర్యబలతేజములు తిరుగ వర్ధిల్లుటకై స్త్రీ పురుష విచక్షణలుగాని వర్ణభేదములుగాని మంత్రధ్యానము కొఱకు

లేకుండునట్లుచేసి గృహములన్నియు మంత్ర స్పందనములచే ప్రతిధ్వనించు నట్లొనర్చుట నాల్గవది. ఈ నాలుగింటి నేకకాల మందే సాధించవలెను. అప్పుడు మనదేశము, మనజాతి కూడ సర్వారిష్టములనుండి విముక్తిబొందుట తథ్యము...''*

రంగయ్యనాయునితో మాటాడుచు కావ్యకంఠుడు ఒకనాడు ఇట్లు ఉద్ఘాటించెను. "రాతియుగము, కంచుయుగము అను విభాగము లూహాగానములు. బృహత్తరమైన మనదేశమందిప్పటికిని వెండిబంగారములతోపాటు ఇతర లోహములను రాళ్లను పాత్రలుగా వాడుక చేయుచున్నాము. మట్టితో చేయబడిన కుండలను వాడుచుంటిమి. ఏయే కార్యముల కేవేవి శ్రేష్ఠమో యుగయుగముల నుండటనే మనము తెలిసికొంటిమి. తెలియనివారును మనమధ్య మున్నారు. అట్టివారిని జూచి వారు మనతొలినాగరికతకు చెందిన వారనుట సమంజసము కాదు. .........నాగరికత యనునది దీనిని బట్టి మనము వాడుకచేయు పాత్రలపై అధారపడ దని విశద మగును. ...... ఇట్టి ధోరణి చొప్పున మన మతమునకు గూడ చరిత్ర వ్రాసినవా రున్నారు. వీరి దృష్టిలో వేదకాలమందాచార్యులు పశువులమందల నడవులందు మేపుకొనుచు పశు సంపదకొఱకే ప్రార్థించువా రనియు, కొండలను నదులను దైవములుగా భావించి నిర్గుణదేవతాతత్త్వమును గ్రహింపలేకుండి రనియు దోచినందున వేదకాలమునందు మతభావములు సంకుచితములై, క్రమాభివృద్ధిచే విశాలము లగుచు, జైన – బౌద్ధ – మహమ్మదీయ – క్రైస్తవ ప్రవక్తల ప్రబోధములను గ్రహించి పూర్ణతచెంది నట్లెంచువారు

*నాయన – పుటలు 173, 174

భావదాస్యముచే ప్రభువులు వ్రాయించినవన్నియు సత్యములని జనులు గ్రహించుచుండిరి. మన పురాణములను రచించిన కవులు మనవారైనను తమకున్న మహత్తర కవితా ప్రజ్ఞ నిట్లు నీచకథలను పరివ్యాప్త మొనర్చుట కియ్యకొనినట్లు నాకు దోచు చున్నది. ఒకదాని నొకటి పోలని యీ పురాణములకు ప్రామాణ్య ముల నిచ్చు మన పండితులు సైతమందలి కల్పిత కథలను విమర్శింపకుండుట శోచనీయమై యున్నది. అట్టి కథల నందుండి తొలగించినచో మనకు అవి యన్నివిధముల పూజా గ్రంథములు కాగల్గునని నా నమ్మిక"*

ఒకనాడు రంగయ్య "దేనిని గురించి మీరింత దీర్ఘముగా మాటిమాటికి ధ్యానించుచుంటిరి" అని అడుగగా కావ్యకంఠుడు "దశాం దేశ స్యైతాం ప్రతిపద మయం ధ్యాయతి జనః" (ఈ దేశముయొక్క దశనే మాటిమాటికి ఈ జనుడు తలపోయు చున్నాడు.) అని చెప్పి తన యభిప్రాయములను రెండుశ్లోకములలో వ్యక్తీకరించెను. దీనిని బట్టి భారతజాతి యొక్క దుర్గతిని గూర్చి ఆయన ఎంతగా పరితపించుచుండెనో స్పష్ట మగుచున్నది.

చెన్నపురి నుండి కావ్యకంఠుడు తిరువణ్ణామలై చేరిన కొన్నాళ్లకు రంగయ్య రామస్వామితో కూడివచ్చి వేలూరులోని క్రైస్తవ కళాశాలలో ఆంధ్ర బాషాధ్యాపకపదవిని స్వీకరింపుడని

---

*నాయన – పుటలు 175, 176

ఆయనను కోరెను. ఆ మాటవిని విశాలాక్షమ్మకూడ భర్తను ప్రోత్స హించెను. 1904 జనవరిలో ఆయన అరుణాచలం వీడి వేలూరు నకు వచ్చెను. కళాశాలలో ప్రవేశించిననాడే యఫ్. ఏ. తరగతిలో (F. A. - Father of Arts ఇప్పటి ఇంటర్మీడియేట్) రామస్వామికి మేనల్లుడైన అప్పుశాస్త్రిని (కె. జి. సుబ్రహ్మణ్యశాస్త్రి) తనకు ఆప్తుడైన శిష్యునిగా గుర్తించెను. అప్పుశాస్త్రి తన తమ్ముడైన కళ్యాణ రామునితో గురువును సేవించుచుండెను. ఈ సోదరులను తనకు పూర్వజన్మ సంబంధులైన కింకరులనుగా గుర్తించి కావ్యకంఠుడు వీరికి మంగళ ప్రదమగు మంత్రమును ఉపదేశించెను.

వేలూరులో కావ్యకంఠునియొద్ద ఎందరో స్త్రీలు పురుషులు మంత్రదీక్షలను గైకొనిరి. వీరిలో విద్యార్థులు అధికముగా నుండిరి. పెద్దలలో సర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారికి పినతండ్రియైన నరసింహం ప్రముఖుడు. ఈయనయే తర్వాత సన్న్యసించి ''ప్రణవానందు'' డయ్యెను. ఇంటియొద్ద ఆధ్యాత్మిక బోధన కాక పెద్దల యభ్యర్థనమున కావ్యకంఠుడు బహిరంగసభలలో కూడ వేదమత ప్రాముఖ్యమును గూర్చి బోధించెను. ఈ ప్రసంగముల వలన హైందవమతమును పరిహసించు వ్యసనము క్రైస్తవులలో చాల వఱకు తగ్గెను. ఉపాధ్యాయులయందున్న గౌరవమునకు నిదర్శనముగా వారి మతమునకు బానిసలు కానక్కఱలేదని విద్యార్థులు గ్రహించిరి. విద్యార్థులయందు వేదమతాభిమానముతో పాటు మాతృదేశభక్తి ప్రబలజొచ్చెను. ఉత్తరదేశమున ప్రజ్వరిల్లు చున్న విప్లవోద్యమముచే చెన్నపురమున విద్యార్థులు ప్రభావితులై ఉద్రేకము నొందజొచ్చిరి. దొరస్వామి వారికి నాయకుడై వేలూరు

నకు వచ్చి ఆ ప్రాంతమున విప్లవము నారంభించుటకు కావ్య కంఠుని యాశీస్సులను అర్థించెను. ఆయన దొరస్వామిని మందలించి విద్యార్థులు నాయకుల ప్రచారమునకు లోనై తమ విద్యాభ్యాసమును వదలుకొనుటగాని, జీవితములను అపాయముల పాలొనర్చుటగాని మూర్ఖత్వమని, విప్లవనాయకులు తమ స్వార్థమునకు విద్యార్థుల జీవితములను బలిగొనుట తప్పు అని పాఠశాలలో ప్రధానోపాధ్యాయుని యధ్యక్షతయందు జరిగిన సభలో హెచ్చరించెను. తరువాత కొందఱు విద్యార్థులు ఆయన యొద్దకు వచ్చి దేశ స్వాతంత్ర్యము కొఱకు మంత్రశక్తితో ఉద్యమమును నడుపగల యొక సంఘమును స్థాపింపుడని కోరిరి. అప్పుడు ఆయన బ్రాహ్మణ విద్యార్థులతో ఇంద్రసంఘమును స్థాపించి, అది వేద మతోద్ధరణమునకు కృషిచేయవలయునని "ఉమాం వందేమాతరమ్" అను నొక మంత్రమును కల్పించి వారికి ఉపదేశించెను. ఆయన విద్యార్థులను రెచ్చగొట్టి ప్రభుత్వముపై విప్లవము జరుగునట్లు చేయుచున్నాడని కొందఱు ప్రభుత్వమునకు ఫిర్యాదులను చేసిరి. కాని యధికారులు విచారించి ఈ యపవాదులను త్రోసివేసిరి.

17–2–1907 తేది రాత్రి వేకువజామున కావ్యకంఠునకు భద్రకుడు కలలో కన్పించి "ఓయీ! నా దేహయాత్ర ముగిసినది. నీవు స్వయముగా జాగరూకుడవై యుండుము; ఇంక నీ తపస్సు చేత సంఘము తీవ్రముగా చలించును" అని యంతర్ధానము నొందెను. కావ్యకంఠుడు సోదరుడు పోయినట్లుగా దుఃఖించి స్నానమొనర్చి వానికి తర్పణము గావించెను. తరువాత ఆ రాత్రియే మరణించిన దివ్యజ్ఞాన సమాజాధ్యక్షుడైన కల్నల్ అల్కాట్ దొరయే

భద్రకుడని వార్తాపత్రికలో వేయబడిన బొమ్మను చూచి గుర్తించి, అతడు జీవించియుండగా తాను అతనిని కలిసికొనలేక పోతినని కావ్యకంఠుడు పరితపించెను.

తండ్రి యభిలాషను తీర్చుటకై గణపతిశాస్త్రి కలువఱాయి నుండి అయనను గైకొనిపోయి కాశీయాత్ర చేయించెను. గంగలో స్నానము చేసినంతనే అయనకు నేత్ర రోగము ఉపశమించెను. స్వగ్రామమునకు చేరగానే వేలూరులో తన కుమారుడైన మహాదేవునకు మశూచి వ్యాధి సోకినట్లు తెలిసి అయన భార్యతో వెంటనే బయలుదేరి వేలూరునకు వచ్చెను. కుమారుని చూచి అయన ఉగ్రమారీచి నాహ్వానించి శ్లోకములను చెప్పినంతనే మశూచి మాయమయ్యెను.

తరువాత దసరా యుత్సవములలో గణపతిశాస్త్రి సకుటుంబముగా "పడైవీడు" లోని రేణుకాదేవిని దర్శించెను. నాటి నుండి అయనకు తపస్సుపై ఇచ్ఛ తీవ్రము కాజొచ్చెను. ఒకనాడు థామస్ హారిస్ అను ప్రధానోపాధ్యాయుడు ప్రసంగవశమున 'సంసారమును విడిచి నిజముగా తపస్సు చేయువారు ఇప్పుడు ఎవ్వరున్నారు?' అని పలికెను. వెంటనే కావ్యకంఠుడు 'నేను చేసెదను' అని ఉద్యోగమునకు అప్పుడే రాజీనామా ఇచ్చి 3-11-1907 వ తేది తపస్సు చేయుటకు తిరువణ్ణామలైకి తిరిగి వచ్చెను.

# 6. రథ చలనము

ఆయన అరుణాచలమున వాసుదేవశాస్త్రి అను శిష్యుని యింట బసచేసి తనకు తపస్సునకు యోగ్యమైన స్థలమును చూపుమని తొందర చేసెను. అతడు మరకత శ్యామాంబికాలియమును (పచ్చైయమ్మన్ కోవెల) యోగ్య స్థలముగా చూపెను. వెంటనే వాసిష్ఠు డచ్చట దీక్షను గైకొని ఆ దేవినే ధ్యానింప నారంభించెను. ఒకనాడు రాత్రి పది గంటల వేళ ఆయనకు మొదట మధురతమ మగు నృత్య శబ్దము వినిపించెను. తర్వాత వందలకొలదిగా శివ గణములు వికృతరూపములతో వచ్చి వికటాట్టహాసములతో ఆయనను పరివేష్టించిరి. అది దుర్భరమై ఆయన దుర్గను ప్రార్థించెను. మఱుక్షణముననే ఆ గణములు మాయమయ్యెను. ఆ కోవెల చెంత పసుల కాపరుల యాగడముల వలన ధ్యానమునకు భంగము కలుగు చుండుటచే ఆయన తపస్సునకు నిశ్శబ్ద వాతావరణము ఆవశ్యకమని ఆ ప్రదేశమును వీడి నైరృతి లింగ స్థలమునకు చేరెను. అచ్చట వారము దినములు గడచునప్పటికి అరుణాచలే శ్వరుని యాలయమున కృత్తికోత్సవములు ఆరంభ మయ్యెను.

ఉత్సవము లందు ఏడవనాడు ఊరేగుచుండిన రథము వేద పాఠశాలకు, అన్నధర్మశాలకు మధ్య చదునైన బాట యందే హఠాత్తుగా స్తంభించెను. ప్రజ లెందఱో పూనుకొని ఎంత లాగినను ఆశ్చర్యకరముగా అది కదల లేదు. వారు అర్ధరాత్రి వఱకును దానితో పెనగులాడి అలసిపోయి యిండ్లకు పోయిరి. అట్లగుట పెద్ద యనర్థమునకు కారణ మగునని అందఱు అలజడి నొంద

జొచ్చిరి. ఆ సమయమున ధ్యానము ముగించి నిద్రించుచున్న వాసిష్ఠునకు కలలో గుడిలోని పెద్ద పూజారి కన్పించి, 'ఆచార్యా! మీరు వచ్చినగాని కదలనని భగవంతుడు చెప్పుచున్నాడు; కావున మీరు రావలె' అని మాయమయ్యెను. మేలుకొన్న తరువాత ఆయనకు 'ఈశ్వరుడు నిన్ను పిలుచు చున్నాడు' అని అశరీరవాణి వినపడెను. అది ఈశ్వరాజ్ఞ అని వెంటనే రథము నొద్దకు వచ్చెను. అప్పుడు ఆ ప్రదేశమున కాపలావారు తప్ప జనులు లేకుండిరి. ఆయన ఈశ్వరునకు నమస్కరించి ఉదయమే వత్తునని నివేదించి నైరృతి లింగ స్థలమునకు తిరిగి వచ్చి నిద్రించెను. తెల్లవారి లేచు నప్పటికి ఆలస్యమైనదని చింతించుచు ఆయన ఉదయము పది గంటలకు రథము నొద్దకు వచ్చెను. అప్పటికి అది యట్లే నిశ్చలముగా నుండెను. లాగుచున్నవారు ఆయాస పడుచునే యుండిరి. ఆయన లాగుచున్న వారిని ఆగుమని చెప్పి, పూజారులు త్రోవ చూపుచుండగా రథమును సమీపించి దేవుని కెదురుగా నేలపై సాష్టాంగముగ ప్రణమిల్లి 'తండ్రీ! ఇంక నీ రథమును కదలునట్లు అనుగ్రహింపు' మని ప్రార్థించెను. ఆయన లేచి ప్రక్కకు తప్పుకొని గుంపులో కలిసిపోయెను. అప్పుడు ప్రజలు లాగగా రథము సులభముగా కదలెను. 'ఈ మహాభక్తు డెవరో' అని ప్రజలు వెదకుచుండగా, వాసిష్ఠుడు వడివడిగా ప్రక్క సందులలో నుండి దూరముగ నేగెను.

# 7. "నాయన" నామము

అనాడు భోజనానంతరం వాసిష్ఠుడు రథ చలన సంఘటనము వలన వ్యక్తమైన ఈశ్వరానుగ్రహమును గూర్చి ధ్యానించు చుండగా, బ్రాహ్మణ స్వామిని దర్శింప వలయునని తలంపు హఠాత్తుగా కలిగెను. 'ఆ స్వామి యందు కాషాయము, దండము మొదలుగా ఆశ్రమ ధర్మ లక్షణములు ఏమియు లేకున్నను, ఆయన యందు అచంచలమైన యాత్మ నిష్ఠ ఏదో వున్నది. లేకున్నచో అంత తేజస్సు కలవాడు అట్లు నిశ్చలముగా నుండ గలుగుట సంభవము కాదు; ఆయన సన్న్యాసి కాకున్నను సకలాశ్రమములను అతిక్రమించిన యవధూతయై యుండును' అని వాసిష్ఠున కప్పుడు తోచెను. తోచినదే తడవుగా ఆయన మండు టెండలో వడివడిగా విరూపాక్ష గుహ యొద్దకు పోయెను. అదృష్టవశమున అప్పుడు ఆ ప్రదేశము నిర్జనమై బ్రాహ్మణ స్వామి ఒక తిన్నెపై కూర్చుండి యుండెను. వాసిష్ఠుడు ఆయనకు పాదాభివందనము గావించి భక్తి పారవశ్యమున కనులవెంట బాష్పములు స్రవించు చుండగా ఇట్లు ప్రార్థించెను 'స్వామీ! ఉత్తమములైన పెక్కు మంత్రములతో తపస్సును గాఢముగా చేసితిని. కాని నా యందు ఇంకను దేవుడు ప్రసన్నుడు కాలేదు. నేను పండితుడ నైనను నా సాధనలో ఏమి లోపమున్నదో తెలిసికొన లేకున్నాను. తపస్సుయొక్క స్వరూపమును తెలిసికొనుటకై మిమ్ము శరణు పొందుచున్నాను. అనుగ్రహింపుడు.' స్వామి ఈ ప్రార్థనమును విని నెమ్మదిగా వాసిష్ఠుని గుర్తించి కరుణార్ద్ర దృష్టితో కొంత సేపు చూచి మెల్లగా తమిళమున ఇట్లనెను. "'నేను' అను స్ఫురణము ఎందుండి వచ్చుచున్నదో విచారించినచో మనస్సు అందే లీనమగును. అదియే తపస్సు. జపము చేయు

నిప్పుడు మంత్రనాదము ఎందు ఉదయించుచున్నదో పరికించినచో, పరికించు మనస్సు అందు లీనమగును. అదియే తపము.''

బ్రహ్మోత్సవములలో అష్టమ దినమున కార్తిక శుద్ధ చతుర్దశి యందు అశ్వినీ యుక్త సోమవారమున (18–11–1907) ఈ యుపదేశము జరిగెను.

మొదటి వాక్యముచేత సకల కార్యములకు మొదట పుట్టునట్టి 'నేను' అను కర్తృత్వము యొక్క స్ఫురణము ఎందుండి పుట్టుచున్నదో గమనింప వలయునని, రెండవ వాక్యముచేత సకల వాక్యములకు మూలమైన నాదము ఎందుండి పైకి వచ్చుచున్నదో పరిశీలింప వలయునని అదియే తపస్సని మహర్షి బోధించెను. ఇది విన్నంతనే వాసిష్ఠుడు సకల వేదాంతముల సారము ఇదియే యని గ్రహించి అమృతమును రుచి చూచినవానివలె సంతోషము నొంది మరల గురువునకు సాష్టాంగముగ ప్రణమిల్లి 'ఈ యుపదేశమును అనుసరించి మీ పాద సన్నిధిని కొంతసేపు తపస్సు చేయుటకు అనుజ్ఞ నిండు' అని ప్రార్థించెను. 'గుహ లోపల కూర్చుండి ధ్యానింపుడు' అని స్వామి అనుజ్ఞ నొసంగెను. అదివఱకెన్నడు వాసిష్ఠుడు గుహలో తపస్సు చేయలేదు. గురు కటాక్షము చేత గుహలో ప్రవేశించుటకూడ సంభవించెనని ఆయన సంతసించి గుహలో కూర్చుండి 'నేను' అను స్ఫురణము ఎందుండి వచ్చుచున్నదని విచారింప జొచ్చెను.

ఎట్టి ఆలోచనమును రానీయక, ఆలోచనము ఉబికినంతనే దాని పుట్టుక స్థానమును గమనించుచు దానిని అణచుట ఈ

సాధనము యొక్క పద్ధతి. "నేను" అను స్ఫురణలో రెండు భాగము లున్నవి. మొదటిది కర్తృత్వము. రెండవది మనస్సుయొక్క ప్రసరణము. దీనినే వృత్తి యందురు. కర్తృత్వము చేతనము. మనోవృత్తి జడము. ఆలోచనమును అరికట్టి "నేను" యొక్క మూలమునే పరికించుచున్నచో మనోవృత్తి లయము నొంది 'నేను' శుద్ధ చైతన్యముగా భాసించును. శుద్ధ చేతనమైన 'నేను' అను స్ఫూర్తియే ఆత్మ. 'నేను' శుద్ధముగ గోచరించుటయే ఆత్మ సాక్షాత్కారము.

ఇట్లు విచారించుచు కావ్యకంఠుడు మనస్సును అంతర్ముఖ మొనర్చి దాని మూలమును పొందలేక పోయినను దానియొక్క సమీపమున సుఖస్థితి పొంది సుమారొక గంటసేపు ధ్యానమగ్నుడయ్యెను. ఆ స్థితి తొలగినంతనే వాసిష్ఠుడు "ఇప్పటి వఱకును మఱుగున పడియున్న తపో విధానమును పునరుద్ధరించుటకు భగవంతుడే ఈ కాలమునకు తగిన మహర్షిగా ఈ స్వామి రూపమున అవతరించె" నని నిశ్చయించుకొనెను. ఇంతలో స్వామికి పరిచారకుడైన పలనిస్వామి అచ్చటికి వచ్చెను. అతని వలన స్వామి పేరు 'వేంకటరామన్' అని తెలిసికొని వాసిష్ఠుడు ఆ గురువరేణ్యుని 'భగవాన్ శ్రీ రమణమహర్షి' అని పేర్కొనుట ఉచితమని తలంచెను. వెంటనే పలనిని అడిగి లేఖన సామగ్రిని గైకొని "శ్రీ రమణ పంచకము" అను పేరుతో అయిదు శ్లోకములను రచించి, స్వామి యొద్ద చదివి, అర్థమును తమిళమున వివరించి ఆ శ్లోక రత్నమాలికను గురుదక్షిణగా వాసిష్ఠుడు అయనకు సమ

ర్పించెను. "సరే నాయనా" అని స్వామి దానిని స్వీకరించి భద్ర పరచుటకై పళనికి ఇచ్చెను.

అప్పటికి ఎన్నడును ఒక్క మాటైనను పలుకని స్వామి మాటాడుచుండుటను చూచి పలని ఆశ్చర్యానంద పరవశుడై పురములోనికి పరువెత్తి నలుమూలల "ఎవ్వరో నాయన" అను వ్యక్తితో బ్రాహ్మణస్వామి మాటాడుట కారంభించెనని కనబడినవారి కెల్ల చెప్పెను. పూర్వదినమున రథము కదలినట్లే ఆనాడు స్వామి యొక్క వాక్కు అను రథము కదలినట్లుగా జనులు కుతూహలముతో స్వామియొద్దకు వచ్చిరి. వారికి అందఱకు స్వామి దర్శనము సులభమగుట కొఱకు పలని గుహకు ముందున్న దడిని తీసివేసెను. జనులు గుంపులై స్వామిని పరివేష్టించిరి. ఒక పండితుడు స్వామిని సమీపించి "స్వామీ! మీ రీ దినమున ఎవరో 'నాయన' అను వ్యక్తితో మాటాడుటకై మౌనము వీడినారట. ఆ సత్పురుష డెవడు? ఎక్కడున్నాడు?" అని యడిగెను. స్వామి 'వీరే నాయన' అని వాసిష్ఠుని చూపెను. క్రిందటి దినమున రథము కదలుటకు కారణభూతుడైన వ్యక్తి అతడే అని కొందఱు గుర్తించిరి. రెండు అద్భుతములకు కారణమైన వాసిష్ఠుని అందరు సంభ్రమముతో గౌరవముతో చూచిరి. దాక్షిణాత్యులు దేవుడైన గణపతిని 'నాయన' అని పేర్కొందురు. స్వామి స్వయముగా 'నాయన' అని పేర్కొన్న వాసిష్ఠుడు కూడ గణపతి యంశమున జన్మించి యుండునని వారు స్వామికి, గణపతికిని ప్రణమిల్లిరి. అప్పుడు వాసిష్ఠుడు వారి కిట్లు చెప్పెను. 'ఈ స్వామి లోక గురువుగా అవతరించిన దివ్యమూర్తి. కావున నేను ఈయనకు భగవాన్ శ్రీ రమణ మహర్షి అను నామధేయమును ఏర్పరచితిని. మీరింక వీరిని భగవాన్ అనియే సంబో

ధింపవలె. మీ రందరు రమణ నామ స్మరణముచే ధన్యు లగుదురు గాక. ఇందులకు మనకు సహాయ మగుటకు ఈ క్షేత్ర దేవతయైన సహాయవల్లిని ప్రార్థింతము." ఇట్లు చెప్పి కావ్యకంఠు డొక శ్లోక మున ఆ దేవిని ప్రార్థించెను. ఆనాటి నుండి స్వామికి "భగవాన్ శ్రీ రమణ మహర్షి" అని, వాసిష్ఠునకు "నాయన" అని నామ ములు ప్రసిద్ధము లయ్యెను.

వాసిష్ఠుని లేఖ వలన "నాయన" వృత్తాంతము నెఱింగి దీపోత్సవము నాటికి విశాలాక్షమ్మ ముప్పది మంది శిష్యులతో వచ్చెను. ఆమెను చూచి మహర్షి "అమ్మ వచ్చినది" అని నాయనతో చెప్పెను. నాయన ఆమెను "అమ్మా" అని సంబో ధించెను. ఆమెకూడా భర్తను "నాయన" అని సంబోధించెను. ఆ సన్నివేశమును చూచుచుండగా మహర్షికి సంతోషమున కన్నుల నుండి బాష్పములు స్రవించెను. పిదప ఆమె శిష్యులతో కూడ భగవానునకు వందనము గావించి శరణాగతి చేసెను. అమ్మను గుహలోనికి పిలిచి వాసిష్ఠు డామెకు తారా మంత్రమును ఉపదేశించి దానిని వ్యాపింప జేయుటకు అధికార మొసంగెను. అప్పుడు పర్వత శిఖరముపై జ్యోతి వెలిగెను. ఆ జ్యోతికి భగవానునకు అందఱు ప్రణమిల్లి బయలు దేరిరి.

నాటి నుండి అమ్మ నాయనలు తమకు భగవానునిచే వానప్రస్థాశ్రమము అనుగ్రహింప బడినదని తలంచిరి. భార్యతోకూడ బ్రహ్మచర్యము నవలంబించి తపస్సు చేసికొనుచుండుటయే వానప్రస్థమునకు ముఖ్య లక్షణము.

మఱునాడు అమ్మ శిష్యులతోకూడ వెళ్ళిపోయెను. భగవానుడే స్వయముగా చూపిన చూతగుహలో వాసిష్ఠుడు తపస్సును ఆరంభించెను. మహర్షికి అన్నమును తీసికొనివచ్చుచున్న ఎచ్చెమ్మయే వాసిష్ఠునకు కూడ భోజనం సమకూర్చుచుండెను. రమణోపదేశము వివరించుచు వాసిష్ఠుడు దేవీస్తవ రూపమున ఉమాసహస్రమును ఇరువది దినములలో ముగించుటకు దీక్షబూని గురుని యనుమతినిపొంది 26-11-1907 నుండి గ్రంథమును ఆరంభించెను. గడువులోపల పూర్తి కాకున్నచో గ్రంథమును చింపి వేయుదునని ఆయన శపథమొనర్చెను. గ్రంథము కొన్నిదినములు వేగముగా జరిగెను. తుది దినములలో ఆయనకు కుడిచేతి బొటనవ్రేలిపైగోరుచుట్టువంటిది ఏర్పడి వ్రాత మందగించెను. గ్రంథము ఏమగునో అని అందఱు ఆందోళన చెందజొచ్చిరి. స్వప్నమున ఒక బ్రాహ్మణుడు ఆదేశించెనని పుణ్యకోటి అను వైద్యుడు వచ్చి ఆ వ్రణమునకు చికిత్సచేసెను. బాధ తొలగినను వ్రాయుటకు వ్రేలికట్టు అడ్డముగా నుండెను. ఇరువదియవ దినమునకు ఇంకను 250 శ్లోకములు కావలసి యుండెను. ఆ రాత్రి అయిదుగురు లేఖకులను ఏర్పరుచుకొని వాసిష్ఠుడు ఆశువుగా శ్లోకములను చెప్పనారంభించెను. మహర్షి ఆయనకు వెనుకకూర్చుండెను. అర్ధరాత్రమునకు పూర్వమే నాయన ఒక్కొక్క లేఖకునకు 50 శ్లోకములను చెప్పి గ్రంథమును ముగించెను. అప్పుడు రమణుడు సమాధినుండిలేచి "నాచే చెప్పబడినదంతయు వ్రాసికొంటిరా?" అని యడిగి అందఱకును ఆశ్చర్యమును కలిగించెను. నాయన సంతోషముతో, "చిత్తము, అట్లే గ్రహించి గ్రంథమును ముగించితిని" అనెను. అది అట్లు పూర్తి

యగుటకు గురుని యనుగ్రహమే కారణమని గ్రంథము చివర నాయన ఉల్లేఖించెను.

పిదప మహర్షి ఆదేశమున నాయన కొండ శిఖరమున "సప్తర్షురి" అను ప్రదేశమునందు శిరస్సుయొక్క తాపమును శమింపజేసుకొనుటకు వారము రోజులుండి, దూరదృష్టి దూర శ్రవణము మొదలగు సిద్ధులను పొంది తిరిగి వచ్చెను. తరువాత మరకత శ్యామాంబాలయమున మహోత్సవముగా నాయన గ్రంథ మును పఠించెను. అప్పుడు ఒకనాడు చిఱుపాకం కొండయ్య అను గణపతి యుపాసకుడు అక్కడికి వచ్చెను. "నీవు గణపతి యుపాసకుడవు గదా!" అని నాయన అతనిని పలుకరించెను. అతడు ఆశ్చర్యము నొంది ఇట్లనెను. "ఔను. నేను గణపతిని ఆరాధించుచు కావించిన యాజ్యహోమమునందు ప్రజ్వరిల్లిన జ్వాలలలో ఒక దివ్యాకృతి కన్పించెను. గణపతియే అట్లు గోచరించెనని తలంచితిని. ఆ యాకృతి గల పురుషుడు ఎక్కడనైన కనిపించునేమో అని వెదకుచుంటిని. ఆ పురుషుడు మీరే" ఇట్లు చెప్పి కొండయ్య నాయనకు పాదాభివందనము గావించెను. దీని వలన గణపతియే నాయనగా అవతరించెనని అందరకును తెలిసెను.

మఱియొకనాడు ఇంకొక సంఘటనము సంభవించెను. వేకువజామున భక్తులందరు శ్రీ రమణ సన్నిధియందు ప్రార్థనకు ఉపక్రమించుచుండగా హఠాత్తుగా రమణుని చుట్టు ఒక జ్యోతి ఆవిర్భవించి ఆయన ఫాలమును ఆరుసార్లు తాకెను. ఆ తేజస్సు

అంతయు ఆయనయందే లీనమయ్యెను. దీనివలన షణ్ముఖుడే రమణుడని వ్యక్తమయ్యెను. నాయన భక్త్యావేశమున లేచి మహర్షిని కార్తికేయునిగా స్తుతించుచు 8 శ్లోకములను చెప్పి ఆ విధముగా తన గురువుయొక్క అవతార రహస్యము ప్రకటనముగుట తన గ్రంథ రచనకు ఒక ఫలమని, దానిచే గ్రంథము చరితార్థమయ్యెనని ఆనందించెను.

అప్పుడే వేలూరు నుండి కళ్యాణ రాముడు వచ్చెను. పడైవీడులో పెద్ద చెరువు గట్టునొద్ద ఒక పొదలో తనకు మొండెము లేని ఒక శిరస్సు కనిపించెనని అది అనిబిసెంటు యొక్క శిరస్సును పోలియుండెనని అదియే అద్భుతమైన తేజస్సుతో రేణుకాదేవి శీర్షముగా స్ఫురించెనని అతడు చెప్పెను. మహర్షి రేణుకా తత్త్వము మంత్ర శాస్త్రములో ఎట్లున్నదని నాయనను అడిగి కుతూహలముతో వినెను.

కాశిలో నాయనకు దుర్గామందిర యోగియైన సుకేతుడు కన్పించినప్పుడు, తాము పదునార్వురు లోకకార్యము కొఱకు జన్మించితిమని, వారిలో గణకు డనువాడే గణపతియని, స్థూల శిరస్సువలన గణపతి కావింప దగిన కార్యమెట్టిదో తెలియగలదని చెప్పెను. ఆ స్థూల శిరస్సు రమణుడేయని నాయన గుర్తించెను. కాని ఇప్పుడు నాయన గణపతి యంశమున జన్మించెనని రమణుడు కార్తికేయుని యంశమున పుట్టెనని పై సంఘటనములచే వ్యక్తమయ్యెను. మఱి సుకేతుడు చెప్పిన మాటల కేమి అర్థము? ఆయన యభిప్రాయమును ఇట్లు గ్రహింపవచ్చును. ఈ పదు

నార్వురు ఊర్ధ్వలోకములలో ఒక గణముగా నుండి లోకహితము కొరకు భూమియందు జన్మించియుందురు. ఈ లోకముననేకాక భువర్లోకములందు ఎందఱో ఋషులు ఉన్నారు. వారికి బ్రహ్మయజ్ఞమున ప్రతిదినము తర్పణము చేయుచున్నాము. అందు "సర్వాన్ ఋషీగ్ం స్తర్పయామి" అని "సర్వాన్ ఋషి గణాగ్ం స్తర్పయామి" అని కూడ ఉన్నది. దీనిని బట్టి కొందరు ఋషులు వ్యక్తులుగా ప్రముఖులైయుండగా మఱికొందఱు గణములుగా కూడియుందురని వ్యక్తమగుచున్నది. కావున భద్రకుడు మొదలుగా పదునార్వురు ఒక ఋషిగణమై యుండవచ్చును. వీరిలో ఒక్కొక్కరు ఒక్కొక్క దేవతను ఉపాసించి ఆ దేవతల యంశలతో అవతరించిరని, గణకుడు గణపతి నుపాసించి గణపతిశాస్త్రిగా అవతరింపగా స్థూల శిరస్సు కార్తికేయుని ఆరాధించి ఆ దేవుని యంశతో అవతరించెనని గ్రహింపవచ్చును. స్థూలశిరస్సు యీ గణమునకు నాయకుడై యుండును. కావుననే రమణునియందు స్థూల శిరస్సు గోచరించినంతనే, నాయన, తన్ను ఆయనకు అనుచరుడైన గణకునిగా స్మరించి, రమణుని మహర్షిగా, భగవానునిగా పేర్కొనియుండును. ఈ గణములో భద్రకాదులు కొలదిమంది మాత్రమే నాయన చరిత్రయందు ప్రస్తావింపబడినారు. తక్కినవారు ఎక్కడ ఏ విధముగా జన్మించి ఏయే కార్యముల నిర్వహించిరో నాయన చెప్పలేదు. భద్రకుడు కల్నల్ అల్కాట్‌గా రేణుకాదేవి 'అనిబిసెంటుగా ప్రస్తావింపబడుటచే ఈ ఋషులలో కొందఱు పాశ్చాత్యదేశములలోకూడ ప్రారబ్ధకార్యలబ్ధికై జన్మించి యుందురని యూహింపవలసియున్నది.

ఉమా సహస్రముయొక్క శుద్ధప్రతి లేఖన పఠనములు 1908 జనవరిలో అరంభింపబడి మార్చిలో ముగిసెను. అప్పుడు మరకత శ్యామాంబాలయమునుండి మహర్షి విరూపాక్ష గుహకు బయలుదేరుచుండగా వాసిష్ఠుడు ఆయనను సమీపించి "నాకు ఎక్కడికైన యాత్రగా పోయి తపస్సు చేయవలయునని సంకల్పము కలుగుచున్నది; "అహం" మూలాన్వేషణమే నా సంకల్పముల నన్నింటిని సఫలముగ చేయునా? లేక ఏదైన మంత్రధ్యానము అవశ్యకమా?" అని యడిగెను. "మొదటిదే చాలును; అది సకలార్థసాధకము" అని మహర్షి యనెను. "నా సంకల్పము మంచిదేనా?" అని వాసిష్ఠుడు మరల అడిగెను. అందులకు భగవానుడిట్లనెను. "ఈశ్వరునిపై భారము వేయుడు మీ భారములు తొలగును. తన కర్తవ్యము ఆయనకు తెలియును"

రెండవప్రశ్నకు మహర్షి వాసిష్ఠుని సంకల్పము మంచిదనికాని, కాదని కాని నేరుగా సమాధానము చెప్పలేదు. ఈ సందర్భమున కృష్ణభిక్షు మహర్షియభిప్రాయమును సూచించుచు సద్విద్యలోని పద్యమును ఉదాహరించెను.
"ఈ తత్త్వమునే మహర్షులు 'సద్విద్యలో' (ఉన్నది – నలువది)

"భూభార మీశుండు – పూనంగ నట్లె
యాభాసజీవు డ – య్యది మోయు పూన్కి
గోపురంబును మోతు – నేపున నసెడి
తద్వాహిబింబము – దర్పము నిజము"*

*ప. 16 అనుబంధము శ్రీరమణ లీల – పుట. 128

భూమియొక్క కార్యభారమును ఈశ్వరుడు వహించుచుండగా, జీవుడు ఆ భారమును నేనే వహింతు ననుట, గోపురమును నేను మోయుచున్నానని దాని క్రిందనున్న స్తంభములో చెక్కబడిన బొమ్మ తలంచుట వంటిదే యగును. ఈ యభిప్రాయమును మహర్షి అనేక పర్యాయములు వ్యక్తీకరించెను. హంఫ్రీసునకు మహర్షికి ఇట్టి సంవాదమే జరిగెను.

హంఫ్రీసు:- స్వామీ, నేను లోకోద్ధరణము చేయగలనా?

మహర్షి:- నిన్ను నీ వుద్ధరించుకొనుము. లోకోద్ధరణము చేసినట్లే.

హంఫ్రీసు:- లోకోద్ధరణ సంకల్పము నాకు గలదు; అట్లు సేయ జాలనా?

మహర్షి:- మంచిదే, ముందు నీకే ఉపకారము చేసికో, నీవును లోకులలో నొకడవే గదా! అంతే కాదు; నీవే లోకము; లోకమే నీవు, ఈ రెండును వేఱుగావు*

మహర్షి హంఫ్రీసునకు చెప్పినట్లుగా వాసిష్ఠునకు ఏల స్పష్టముగ చెప్పలేదు? వాసిష్ఠునియందున్న లోకోద్ధరణకాంక్ష చాల గాఢమైనది. దీనికి బీజము తల్లితండ్రుల సంకల్పమునందే యున్నది. వారు దేశము నుద్ధరింపగల పుత్త్రు నొసంగుమని భగవంతుని ప్రార్థించిరి. ఆ సంకల్పమునకు ఫలముగా జన్మించిన వాసిష్ఠునియందు అట్టి సంకల్పము ప్రబలముగానుండుట సహజము. భగవంతుడొసంగిన వరమును తప్పించుట తగదు. ఆ సంకల్ప

---

* శ్రీ రమణలీల – పుటలు 264, 265

మును కొనసాగనిచ్చినచో కొంత కాలమునకు అది క్రమముగా క్షీణించు నను తలంపుతో మహర్షి వాసిష్ఠుని యభిప్రాయమును నేరుగా ఖండింప లేదని తలంప వచ్చును. ఏమైనను యోగులకు తత్త్వవేత్తలకు సంకల్పములు పనికి రావనుట ప్రసిద్ధము. "సంకల్పమును వీడనివాడు ఎవడును యోగి కాజాలడు." (న హ్యసన్న్యస్త సంకల్పో యోగీభవతి కశ్చన – గీత) అని శ్రీకృష్ణ భగవానుడు స్పష్టముగ చెప్పెను. "జ్ఞానామృతముచేత తృప్తుడు కృతకృత్యుడును అయిన యోగికి కర్తవ్యము ఏదియు నుండదు; ఉన్నచో అతడు తత్త్వజ్ఞుడు కాడు" అని విద్యారణ్యస్వామి ఉద్ఘాటించెను.

శ్లో॥ జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః
నైవాస్తి కించిత్ కర్తవ్య మస్తి చేత్ న స తత్త్వవిత్॥

## 8. తపోయాత్ర

వాసిష్ఠుడు బయలుదేరుచుండగా వాసుదేవశాస్త్రిని తోడుగా తీసికొని పొమ్మని మహర్షి చెప్పెను. అట్లే ఇద్దఱు చెన్నపురియొద్ద తిరువొత్తియూరునకు చేరిరి. అచ్చట కపాలిశాస్త్ర నాయనకు శిష్యుడయ్యెను. అక్కడ తపస్సు చేయుచుండగా ఒకనాడు మహర్షి వచ్చి తన్ను స్పృశించి ఆదరించినట్లుగా వాసిష్ఠునకు గోచరించెను. కళ్యాణరామునకు రేణుకాదేవతావేశము కలిగెనని తెలిసి నాయన,

వాసుదేవశాస్త్రిని అరుణాచలమునకు పంపి, వేలూరునకు పోయి కళ్యాణరామునితో పడైవీడునకు పోయెను. రేణుకాక్షేత్రమైన కుండలీపురము పడైవీడుగా ప్రసిద్ధమయ్యెను. ఇది కుండలినీనదీతీరమందున్నది. అచ్చట నాయన కొన్నాళ్ళు ధ్యానమొనర్చుచు కళ్యాణరామునకు స్వస్థతను కలిగించుచుండెను.

ఆ సమయమున వాసిష్ఠుడు మంత్రదీక్షలచే యువకులను వెఱ్ఱెత్తించుచున్నాడని వారిని ప్రభుత్వముపై తిరుగుబాటునకు సన్నద్ధము చేయుచున్నాడని ఉమా సహస్రములో ఆ భావములే ఉన్నవని కొందఱు అపవాదులను ప్రబలజేసిరి. ఈ వార్తలు అధికారులచెవుల కెక్కెను. వారు విచారణకు పూనుకొనిరి. పోలీసులు కావ్యకంఠుని ప్రశ్నించుటకు వచ్చిరి. ఆయన కనుసైగచేయగా శిష్యులు ఉమాసహస్రమును గైకొనిపోయి కుండలినీ నదీతీరమున ఇసుకలో ఒకచోట దాచియుంచిరి. పోలీసులు ఆయనను విచారించి అపరాధి కాడని నిశ్చయించుకొని వెడలిపోయిరి. ఆ రాత్రి నదికి వఱదవచ్చి గ్రంథము కొట్టుకొని పోయెను.

కుండలినీనది గ్రంథమును హరించెనని, అయినను విచారింపవలసిన పనిలేదని, దానిని తాను మరల రచింపగలనని నాయన రమణునకు కబురుచేసెను. ఆ క్షేత్రమును విడుమని పోలీసులు హెచ్చరించినను ఆయన అచ్చటనే యుండి రేణుకను ధ్యానించుచుండెను. 12–5–1908 తేది విశాలాక్షమ్మ ఆడపిల్లను ప్రసవించెనని తెలిసి నాయన వేలూరునకు పోయి పుత్రికకు వజ్రేశ్వరి యని నామకరణ మొనర్చెను.

వాసిష్ఠుడు మరల పడైవీడునకు పోయి 40 దినములు తపస్సు చేసెను. దీక్షాంతము నందు 200 మంది చేటికలతో కూడియున్న రేణుకా దేవిని అయన దర్శించెను. తన శరీరము నందు ఆమె నూతన శక్తిని ప్రసరింప జేసినట్లు, కుమారస్వామి హస్తమందున్న శక్తి అను నాయుధమును తనకు ఒసంగినట్లును అయనకు అనుభవము కలిగెను. తరువాత అయనకు ఋగ్వేదములోని యస్త్ర విద్యా మహామంత్రము గోచరించెను. అది రేణుకా పరశురాముల యనుగ్రహము వలన సంభవించెనని, వేదసూక్త హృదయములను భేదించుటకు అధికారము కూడ తనకు కలిగెనని అయన తలంచెను.

పడైవీడు నుండి వాసిష్ఠుడు వేలూరునకు వచ్చి ఆ యస్త్ర మంత్రము ఉపదేశించుచు శిష్య సంఘమును ప్రబల చేసెను. అది వేద సంఘముగా, ఇంద్ర సంఘముగా ప్రసిద్ధ మయ్యెను. దానిని విప్లవ సంఘముగా ప్రభుత్వాధికారులు భావించి, అయనను బంధించుటకు ప్రయత్నించిరి. వెంటనే అయన షరాయిని టోపీని ధరించి విద్యార్థి వేషములో 'హంపి' కి బయలుదేరెను. హోస్పేటలో ఒక దొంగ యొక్క వంచనము వలన అయన ఒక రాత్రి ఖైదులో నుంచబడెను. మఱునాడు పోలీస్ ఇన్‌స్పెక్టర్ అయన వృత్తాంతమును అడిగి తెలిసికొని విడిపించి మంత్ర దీక్షను పొంది శిష్యుడయ్యెను. అతని సాయమున అయన హంపికి చేరి అక్కడ తపస్సు చేయుటకు బుద్ధి పుట్టక 'మాఉళి' అను క్షేత్రము నందు తపస్సునకు ఉపక్రమించెను. అక్కడ ఒక నెల అనంతరము ఆ క్షేత్ర దేవత మూడేండ్ల బాలికగా సాక్షాత్కరించి "అస్త్ర విద్యా సిద్ధికి

కాలము పక్వము కాలేదు" అని మాయ మయ్యెను. అమె యాదేశముగా భావించి అప్పటి నుండి ఆయన విరాణ్మహా మంత్రముము పెక్కుమందికి ఉపదేశించి వ్యాపింప జేయుట, వేద సూక్తములను పరిశోధించుట తనకు జీవిత లక్ష్యములనుగా భావింప జొచ్చెను.

మాఉళినుండి వేలూరుమీదుగా నాయన తిరువణ్ణామలై వచ్చి రమణుని దర్శించెను. అక్కడ తన శిష్యులు మరల చూత గుహలో వుండుడని నాయనను కోరిరి. "ఉమా సహస్రమును మరల నిర్మించిన తరువాతగాని నేను ఆ గుహలో ప్రవేశింపను" అని శపథముచేసి నాయన వేలూరుకు వచ్చెను. అక్కడ రెండు నెలలు విశ్రాంతి తీసికొని శివరామశాస్త్రిని పిలిపించుకొని వానితో దక్షిణ యాత్రకు బయలు దేరెను. కన్యాకుమారి, శుచీంద్రము, రామేశ్వరము మొదలగు క్షేత్రములను సేవించుచు జంబుకేశ్వరము చేరి శివరామశాస్త్రిని ఇంటికి పంపి, అచ్చట అఖిలాండేశ్వరిని గూర్చి పది దినములు ఆయన ధ్యానించెను. పిదప ఆయన ఉమాస్తుతిని మరల రచింప నారంభించెను. ఎంత ఆలోచించినను 700 శ్లోకములకు పైన జరుగ లేదు. ఈ సప్తశతిని ఆయన శిష్యుని ద్వారా మహర్షి యొద్దకు పంపెను. అచ్చటినుండి ఆయన తిరువొత్తియూరు, చిదంబరము, పక్షితీర్థము, తిరుత్తణిని దర్శించెను. అక్కడనుండి ఆయన వేలూరునకు వచ్చి 1910 ఫిబ్రవరిలో కుమారునకు ఉపనయన మొనర్చెను.

1910 ఏప్రిలులో పంచాపకేశశాస్త్రి వేలూరునకువచ్చి నాయనను చెన్నపురికి ఆహ్వానించెను. కాని నాయన ముందుగా భార్యా

పుత్రులతో అరుణాచలమునకు పోయి ఒక నెల వుండెను. ఆయన అరుణాచలమునకు బయలుదేరునప్పుడు యమ్. హెచ్. హంఫ్రీసు అను నాంగ్లేయుడు తనకు కలలో కన్పించిన మహానుభావునిగా నాయనను గుర్తించి శిష్యుడయ్యెను. తర్వాత నితడు మహర్షిని కూడ దర్శించెను. ఇరువురిని ఇతడు దివ్యావతార పురుషులుగా కొలుచు చుండెను.

1910 మే నుండి 1912 వఱకు నాయన చెన్నపురములో కాపుర ముండెను. తర్వాత అదిశంకరుల జన్మస్థలమగు కాలటి కేగెను. అక్కడ దంపతులు పంచదశీ మహామంత్రమును జపించుచు కొంతకాల ముండి కర్ణాటకములోని గోకర్ణ క్షేత్రమును దర్శించుటకు బయలుదేరి ఉడిపి చేరిరి. అక్కడ సమీపముననున్న బడబాండేశ్వ రము అను బలరామక్షేత్రమందు నాయన కొన్నిదినములు ఒంటరిగా తపస్సు చేసెను. అక్కడి పీఠాధిపతులు ఆయన మహత్త్వమును గుర్తించి సత్కరించుటకు సభను ఏర్పాటు చేసిరి. ఆ సభలో ఆయన వారి యభ్యర్థనమున ఆశువుగా మతత్రయ సిద్ధాంతముల సారమును ( అద్వైత విశిష్టాద్వైత ద్వైతములు ) నూఱు శ్లోకములలో చెప్పెను. అది తత్త్వఘంటాను శాసనముగా, తత్త్వఘంటా శతక ముగా ప్రసిద్ధ మయ్యెను. అది మహర్షి యొక్క ఆదరమునకు పాత్ర మయ్యెను.

1912 ఏప్రిలులో నాయన ఉడిపిని వీడి సకుటుంబముగా గోకర్ణమునకు చేరెను. అచ్చట అమ్మ నాయనలు నిగూఢముగా కృష్ణ మఠమునకు వెనుక భాగమున తపస్సు చేయజొచ్చిరి. కోవెల

పూజారి ఒకడు వీరి మహత్త్వమును గుర్తించి ఊరిలో ప్రచార మొనర్చెను. అప్పుడు అనంతశాస్త్రి అనునొక యుద్దండ పండితుడు గోకర్ణములోని పండితులతో వాద మొనర్చుటకు వచ్చెను. వారు నాయనను ప్రార్థించి ఆయన వాదమునకు ప్రతివాదమును గావిం చుటకు ఒప్పించిరి. అనంతశాస్త్రి ఈశ్వరుని మహిమయొక్క ప్రాముఖ్యమును గూర్చి చమత్కృతితో ప్రవచనము గావించెను. వాసిష్ఠుడు ఆ వాదములోని యుక్తులను ఖండించి ఈశ్వర వైష్ణవ మతములు రెండును వేదము నందు చెప్పబడిన ఇంద్ర మతమునకు శాఖలవంటివని నిరూపించి వేదోద్ధరణము యొక్క అవశ్యకతను ఉద్ఘాటించెను. అనంతశాస్త్రి నిరుత్తరుడై వాసిష్ఠునకు పాదాభి వందనము గావించి శిష్యు డయ్యెను.

పిమ్మట నగరమున నాగేశ్వర వీధిలో శ్రీ వెంకటరమణ పండితుని యింట నాయనకు బస కల్పింపబడెను. అచ్చట జ్యోతి శ్శాస్త్రజ్ఞులు కొందఱు పరాశర సంహిత యందు తమకు కలిగిన సందేహములను నాయనను అడుగ జొచ్చిరి. ఆ సందేహములు తొలగుటకు శాస్త్రము సులభగ్రాహ్య మగుటకును నాయన లఘు సంహిత అను పేరుతో కొన్ని సూత్రములను రచించి యిచ్చెను. జ్యోతిష ఫలములను సరిగా చెప్పుట కిది ఎంతో ఉపకరించు చున్నదని గోకర్ణ పండితులు నేటికిని చెప్పుకొను చుందురు.

ఈ జ్యోతిశాస్త్ర రచనమును గూర్చి శ్రీ నిష్ఠల సీతారామశాస్త్రి ఇట్లు ప్రశంసించినాడు. 'జ్యోతిషశాస్త్ర గ్రంథములలో ఒకే ఒక గ్రంథమున ఇన్ని విషయములు ఇంత సంగ్రహముగా ఎక్కడను

పొందుపరచబడి యుండలేదు. ఇందలి సంజ్ఞలుకూడ శ్రీ గణపతి ముని గారిచే కల్పింపబడినవి. ఈ గ్రంథమునకు నిర్ణయ సంగ్రహ మను పేరుగల గాణపత శాస్త్రమని పేరు. ఈ శాస్త్రమునకు శేష ఫలాధ్యాయములుగా త్రిభావ ఫలచంద్రిక షోడశశ్లోకి అను చిన్న కృతులు రచింపబడినవి. 1966 లో గణపతిశాస్త్రి గారి ప్రియ శిష్యులగు గుంటూరు లక్ష్మీకాంతముగారు గణపతిముని కృతులను తెలుగులో ప్రచురించుచు 'పారాశర్య కేరళీయ సముచ్చయము' అను పేరుతో దీనిని ప్రచురించిరి. జ్యోతిష పండితులగు బ్రహ్మశ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రిగారు దీనికి తెనుగు తాత్పర్యము వ్రాసిరి.*

గోకర్ణములో నాయన ఆ ప్రాంతమునందు ప్రచారములోనున్న వేదములోని యధిక భాగములను పాఠము చెప్పించుకొని యొక పక్షము దినములలో కంఠస్థ మొనర్చెను. ఆ భాగములందు భాగవతములోని కృష్ణలీలాఘట్టముల కాధారము లుండుట నాయనకు ఆశ్చర్యమును కలిగించెను.

కొన్నినాళ్ళైన తరువాత నాయన నగరములో నుండుటకు ఇష్టపడక సమీపమందున్న యుమామహేశ్వర పర్వతముపైఉన్న గణపతి దేవాలయమున భార్యతోకూడ తపస్సు చేసికొనుటకు నిశ్చయించెను. అక్కడ వారికి సహాయుడుగా ఉండుటకు గణేశశర్మ అను యువకుడు ముందునకు వచ్చెను. అతని గోత్ర ప్రవరలోని దేవరాతఋషినిబట్టి అతనిని దైవరాతునిగా నాయన పేర్కొనెను.

---

*జయంతి సంచిక పుట – 64

దైవరాతుడు శిష్యుడైన తర్వాత నాయనకు అనంత శాస్త్రితో వాదము జరిగినట్లు "వాసిష్ఠ వైభవము" నందు (17 వ ప్రకరణము – పే. 185) చెప్పబడినది.

దైవరాతుడు వంట మొదలగు పనులను గావించుచు గురువునకు గురుపత్నికి శుశ్రూష చేయుచు రాత్రులందు నాయన యొద్ద కావ్యములను ఉపనిషద్విద్యలను అధ్యయన మొనర్చుచుండెను.

వినయశీలి వేదపండితవంశము వాడును అయిన దైవరాతుడు నిశ్చలభక్తితో గురువును సేవించి అచిరకాలముననే నాయనకు ప్రీతిపాత్రుడయ్యెను. నీడవలె నాయన ననుసరించి మహేంద్ర గిరిలో, పడైవీడులో నాయనతోపాటు తపస్సుచేసి అనేక దివ్యానుభూతులను పొందెను.

శ్రీ రమణ భగవానుని ప్రథమ దర్శనముననే భక్తి ఉప్పొంగగా దైవరాతునినోట వెలువడిన శ్లోకములే " రమణవిభక్త్యష్టకముగా " ప్రసిద్ధి గాంచినవి.నాయన రచించిన శ్రీ రమణగీతయందు మూడవ ప్రకరణమున దైవరాతుని ప్రశ్నలు భగవాన్ ప్రత్యుత్తరములు కూర్చబడియున్నవి.

పడైవీడులో తపస్సమాధిలో నున్న దైవరాతుని వాక్కునుండి నూతన మంత్రములు వెలువడ సాగినవి. నాయనకు అవి స్పష్టముగా వినిపించెను. పదునాలు దినములలో నాలుగు వందల

యిరువది యెనిమిది మంత్రములు ప్రకటములయ్యెను. నాయన వీనిని "ఛందో దర్శనమ్" అను గ్రంథమున గూర్చి దానికి "వాసిష్ఠాన్వయ భాష్యము" అను పేరుతో వ్యాఖ్యను రచించెను. సంస్కృత వాఙ్మయమునందు ఇది మణిపూస వంటిదని ప్రముఖ పండితులు శ్రీ ఆర్. ఆర్. దివాకర్‌గారు ప్రశంసించిరి. ఇది ఆంగ్లములోనికి అనువదింపబడి భారతీయ విద్యాభవనము వారిచే ప్రకటింపబడినది.

ఈ భాష్యముయొక్క ముగింపునందు నాయన ఇట్లనెను. "విశ్వామిత్రగోత్రజుడైన దైవరాతుడు అధునాతన విశ్వామిత్రుడుగా తపస్సు చేసెను. ఒక ఋషియొక్క దృష్టితో చూచినచో యీ మంత్రములు గంభీరార్థములు కలవి. పవిత్రములు, పవిత్రీకరింప జాలినవి.

ఈ దైవరాతుడు ఒక యోగి, తపస్వి, వేదవేత్త, మంత్రద్రష్ట అని, తపస్సు, పాండిత్యము, సంస్కారము, సద్వర్తనము వినయము అనుగుణములచే ప్రాచీనులైన ఋషులతో సమానత్వమును పొందుటకు అర్హుడనియు చెప్పుటకు నేను గర్వపడుచున్నాను". దైవరాతుడు మాత్రము తన యౌన్నత్యమునకంతకు గురు కటాక్షమే కారణమని వినయముతో చెప్పుకొనెను.

పౌరాణిక కథలను బట్టి వేదార్థములను, వేదార్థములను బట్టి పౌరాణిక కథలను విమర్శించుచుండుటయే నాయన నూతన తపో విధానముగా అవలంబించెను. రెండు పక్షములలో పాడ్యమి

తిథులందు నాయన ఊరిలోని విద్యాపీఠమునకు పోయి పండితుల సందేహములను తీర్చుచు తన పరిశోధన విషయములను వారికి చెప్పుచుండెను.

నాలుగు నెలలు ఇట్లు గడచెను. 1912 డిసెంబరులో తండ్రికి అవసానదశ వచ్చెనని తెలిసి నాయన కలువరాయికి పోయెను. ప్రయాణములో కలిగిన యాటంకమువలన ఆయన చేరునప్పటికి కొన్ని గంటలకు ముందే నరసింహశాస్త్రి స్వర్గస్థు డయ్యెను. తండ్రియొక్క కర్మక్రతువు లైన పిదప నాయన అరుణా చలమున మహర్షిని దర్శించి గోకర్ణమునకు వచ్చెను.

గోకర్ణ సమీపమున " సన్నబేలా " అను గ్రామమునందు ఉప్పుందోపాధ్యాయుఁడు జ్యోతిష్టోమ యజ్ఞమును సంకల్పించి దానికి బృహస్పతినిగా నాయనను వరించెను. దాని యేర్పాటులకై డిశంబరు మూఁడవ వారములోనే నాయన సకుటుంబముగా అక్కడ ఒక యాశ్రమమున బసచేసెను. ఆ యజ్ఞము ఫాల్గున బహుళ పక్షమున అరంభింపబడి 1913 ఏప్రిలులో చైత్ర శుద్ధమున ముగిసెను. ప్రతిదినము నాయన యజ్ఞకర్మ మంత్రముల యర్థములను వివరించుచుండెను. యజ్ఞముయొక్క ఉపసంహారమునందు ఆయన కన్నడమున అనర్గళముగా ఉపన్యసించి అందఱకు ఆశ్చర్యమును ఆనందమును కలిగించెను. పిమ్మట ఆయన యజ్ఞమునకు జయమును గూర్చిన యింద్రాణియొక్క మంత్రమును మౌనదీక్షతో వారము దినములు జపించెను.

1913 అగస్టులో అప్పుశాస్త్రియభ్యర్థమున నాయన సికింద్రాబాదునకు చేరెను. అక్కడ అనేకులు ఆయనవలన మంత్ర దీక్షలను పొందిరి. వారి మూలమున పెక్కుసభలలో ఉపన్యసించుచు ఆయన మహర్షియుపదేశమును ప్రసరింపజేసెను. తండ్రి యొక్క సాంవత్సరికములకు ఆయన కలువరాయికిపోయి, అక్కడ నుండి డిసెంబరు మూడవవారములో తిరువణ్ణామలై చేరెను. అక్కడ అరుణాచలశాస్త్రి అను పండితునితో రమణుని సమక్షమున 29-12-1913 తేది నాయన వాదించి ఆయన ప్రతిపాదనములను ఖండించి ఇట్లు ఉద్ఘాటించెను. "శాస్త్రీయమైన సత్యాసత్యముల చర్చయొక్కటియే ముక్తిని ఈయజాలదు. ముక్తికి ఉపాసనము ముఖ్యసాధనము. స్వరూపనిశ్చయమే నిజమైన జ్ఞానము. ఆత్మజ్ఞానమునకు సాధనమైన యోగము కోర్కెలను కూడ సాధింపగలదు. కోరిక కొఱకు యోగమారంభించి మధ్యలో జ్ఞానసిద్ధిని పొందినచో మొదటి కోర్కె కూడ సిద్ధించును. కాని జ్ఞానికి దానియందు అపేక్ష యుండదు."

గురుని యొద్ద ఇంచుమించుగా ఒక పక్షము దినము లుండి నాయన 1914 జనవరిలో సికింద్రాబాదునకు చేరి దానికి సమీపమున 'కర్లేళి' గ్రామమున నాలుగు మాసములు తపస్సు చేసెను. తరువాత అమ్మ యభిలాషను తీర్చుటకై నాయన ఉత్తరదేశ యాత్రలకు బయలు దేరెను. భువనేశ్వరము నందు అమ్మ నాలుగు నెలలు భువనేశ్వరీ మంత్రమును జపించి హస్తమున పాక మహిమను అక్షయత్వ సిద్ధిని పొందెను. అక్కడ నుండి నాయన తల్లి యొక్క అబ్దికము కొఱకు మందసాకు వచ్చెను. అప్పుడా శ్రాద్ధ

కార్యమున అమ్మ చేసిన వంట యందు అపూర్వమైన రుచియే కాక, వండిన పదార్థము ఎంతమంది కైనను అక్షయముగా సరిపోవుట ఆశ్చర్యకరముగా నుండెను. మందసాలో రాజ కుటుంబమువారి యభ్యర్థనమున అమ్మ నాయనలు ఇంచుమించుగా ఒక సంవత్సర ముండిరి.

మందసా యందు వారు మూడు సంవత్సరము లుండిరని వాసిష్ఠ వైభవము నందు చెప్పబడినది.

"వత్సరత్రయ కాలోఽభవన్మందసాయా మావాసః" *

జగదీశ శాస్త్రి యొక్క సోదరుడు రామనాథ బ్రహ్మచారి (యజ్ఞరామ దీక్షితుడు) తిరువణ్ణామలై నుండి మందసాకు వచ్చి 'హృదయకుహర మధ్యే' అను శ్లోకమును జగదీశశాస్త్రి ఆరంభించి వదలిపెట్టగా రమణ భగవానుడు దానినెట్లు పూరించెనో నాయనకు వివరించి చెప్పెను. ఆ శ్లోకము యొక్క అర్థ గాంభీర్యమునకు నాయన ఆశ్చర్యపడి తన యానందమును ఆ బ్రహ్మచారి ద్వారా గురువునకు నివేదించుకొనెను.

మందసా నుండి కలమూరి వేంకటశాస్త్రి (అధాము) అను శిష్యునితో అమ్మతో రెండు నెలలలో కాశి, గయ, ప్రయాగ, అయోధ్య మొదలగు క్షేత్రములకు నాయన యాత్ర గావించెను. అప్పుడు బృందావన మధురలో జరుగుచుండిన పండిత సభలకు పోయి నాయన, బాల్యమునకు కన్యాత్వమునకు భేదము కలదని,

---

* 195 – ప్రకరణము – 18

'శ్లో॥ అష్టవర్షా భవేత్ కన్యా' ఇత్యాది శ్లోకములు కల్పితములని, కన్యాత్వము రజో దర్శనముతో ఆరంభ మగునని, తరువాత మూడేండ్ల వఱకు వివాహము జరుపవచ్చునని అది కన్యా వివాహమే అగునని నిరూపించెను.

1916 మార్చిలో మందసాకు వచ్చి నాయన అటనుండి కలువఱాయికి చేరెను. 5-5-1916 తేది నలనామ సంవత్సర వైశాఖ శుద్ధ ద్వితీయ వజ్రేశ్వరికి ఎనిమిదవ యేటనే నాయన బంధువుల పట్టుదల వలన వివాహమును గావించెను. తిరువణ్ణామలైకి బయలు దేరుచు త్రోవలో నెల్లూరు నందు రాజకీయ సభలో నాయన సంస్కృతమున అనర్గళముగా ఉపన్యసించెను. మఱునాడు అక్కడ జరిగిన సనాతన ధర్మ సభలో నాయన 'వేదశాస్త్ర సంప్రదాయములు' అను సమాసమును ద్వంద్వమునుగా గ్రహించి వేదములు, శాస్త్రములు, సంప్రదాయములు మూడును సమానముగా ప్రమాణము లైనట్లు గ్రహించుట తప్పు అని, దేశ కాలములకు అనుగుణముగా సంప్రదాయములను సంస్కరించుకొనుట వలన వైదికమైన ధర్మమునకు భంగము వాటిల్లదని ఉద్ఘాటించెను. సంప్రదాయ వాదులకు కొంతమందికి ఆ యభిప్రాయములు నచ్చ లేదు.

తిరువణ్ణామలై చేరి నాయన గురు దర్శనము గావిం[illegible] మందసాకు తిరిగి వచ్చెను. అక్కడ మహేంద్రగి[illegible] ఒక గోకర్ణేశ్వరాలయము వున్నది. పశ్చిమతీర గో[illegible] నందున్న దైవరాతుడు మందసాకు వచ్చి ఈ గోకర్ణమును [illegible]

శివరాత్రి దినమున మందసా రాజుయొక్క సాయమున నాయన శిష్య సమేతుడై శిఖరమున నున్న యాలయమును చేరి అందున్న లింగమును పరీక్షించెను. పశ్చిమ గోకర్ణమున లింగము గోవు చెవి యొక్క ఆకృతిలో నుండగా ఇక్కడ గోవు చెవియొక్క రంధ్రము వంటిదే లింగము నందు రంధ్రము వుండుటను గమనించి ఈ లింగమును 'దహర గోకర్ణేశ్వరుడు' అని నాయన పేర్కొనెను. దహర మనగా రంధ్రము లేక లోపలి ప్రదేశము – ఆ యాలయ మునకు ప్రక్కన విష్ణుదేవుని యాలయ ముండెను. ఆ దేవుడు పరశురాముడని నాయన గ్రహించెను. ఆ రెండు అలయముల మధ్య కూర్చుండి నాయన 20 దినములు 'అహం' మూలాన్వేషణ రూపమును తపస్సు చేసి తన యందు పరశురాముని తేజస్సు ప్రవేశించినట్లుగా అనుభూతిని పొందెను.

వాసిష్ఠ వైభవము నందు దైవరాతుడు గురువును దర్శించుటకు వచ్చిన తరువాత పింగళ సంవత్సర జ్యేష్ఠ మాసారంభమున 1917 జూన్‌లో మందసా నుండి నాయన అరుణాచలమునకు పోవునప్పుడు నెల్లూరియందు సభలలో ఉపన్యసించుట జరిగెనని చెప్పబడియున్నది.*

# 9. క్రోధాగ్ని

1917 జూన్‌లో నాయన మందసా నుండి తిరువణ్ణామలై చేరెను. అప్పటికి చూతగుహ వాసయోగ్యముగా లేదు. దానికి మరమ్మత్తు అవశ్యకమైయుండెను. నాయన ఎచ్చెమ్మాళ్ ఇంటియందు కాపురముండి "హృదయకుహర మధ్యే" అను శ్లోకమునకు వ్యాఖ్యానముగా ఉపనిషత్తువంటి గ్రంథమును 7–7–1917 తేది ఆరంభించెను. 23వ తేది విరూపాక్ష గుహయందు తాను సకుటుంబముగా నుండుటకు నాయన మహర్షి యనుమతిని కోరెను. గృహస్థులు ఆ గుహయందు ఉండరాదను నియమము ఉండెను. అయినను అమ్మనాయనలు బ్రహ్మచర్యముతో నున్నారని కాబోలు మహర్షి నాయనకు అనుమతి నొసంగి, పలనిని పిలిచి ఆ గుహను బాగు చేయుమని చెప్పెను. అతడు దానికి తాళమునుకూడ తీయలేదు. నాయన వచ్చి మహర్షికి ఆ విషయమును చెప్పెను. మహర్షి పలనిని పిలిపించి నాయనకు తాళపుచెవినైన ఇమ్మనెను. ఆ గుహలో నాయన సంసారము చేయుటకు వీలులేదని చెప్పుచు తాళపుచెవి నిచ్చుటకు కూడ అతడు నిరాకరించెను. భగవానుని యాజ్ఞను తిరస్కరించుటయేకాక తన బ్రహ్మచర్యమునుకూడ పలని శంకించి, తన్ను సంసారిగా తలంచుట నాయనకు అవమానకర మయ్యెను. అది అయనయందు క్రోధమును ప్రజ్వలింప జేసెను. దానివలన "ఖాండవవనమునందు అర్జునునివలె నేనిప్పుడు ఇచ్చట క్రోధాగ్నిని వదలుచున్నాను" అనునర్థముతో శ్లోకరూపమున నాయన నుండి శాపము వెలువడెను. అంతట ఆ తాళమును ఱాతితో పగులగొట్టి నాయన గుహయందు ప్రవేశించెను. వెంటనే అయన పశ్చాత్తాప

మును పొంది ఆ ప్రాంతమునకు శాపాగ్ని వలన సంతాపము కలుగకుండ ఇంద్రుని స్తుతించెను.

శాపము వెలువడినంతనే భగవానుడు మౌనముతో కనులు మూసికొనియుండెను. కొంతసేపటికి నాయన కావించిన స్తుతివలన పెద్ద వర్షము కురిసెను. భగవానుడు లేచి ఆకాశము వంక జూచుచు వానలో నిలుచుండెను. దేవాలయము వద్దనున్న రథముపై పిడుగు పడి దానిని దహించెను. భగవానుడు "అమ్మయ్య! బ్రతికితిమి" అని స్కందగుహ నుండి దిగి విరూపాక్ష గుహ యొద్దకు వచ్చి నాయనకు దగ్ధమగుచున్న రథమును చూపెను. నాయన ఖేదమును పొందెను. భగవానుడు నాయనను చూచి, "క్రోధము ఇట్లే విచక్ష ణతను కప్పివేయును. భూమికి ఆపదయైనచో మనకు కాదా! రథము కొఱకు విచారింపకుడు. ప్రాతది పోయినచో క్రొత్తది వచ్చును. ఏమైనను ఇకమీాద క్రోధమునకు వశముగానని ప్రమాణము చేయుడు" అనెను. నాయన అట్లే ప్రమాణమొనర్చి గురువునకు వ్యథకలిగినందులకు దుఃఖించెను. భగవానుడు నాయనను ఓదా ర్చుచు గుహలోనికి తీసికొనిపోయి పెరుగు అన్నమును స్వయముగా తినిపించెను. కొలది దినములకే పలని మృత్యువు వాతబడెను.

విరూపాక్షగుహ వసతిగా లేకపోవుటవలన నాయన స్కందా శ్రమమున రమణునితో ఉండజొచ్చెను. అక్కడ దశ మహావిద్యల సారమును సంగ్రహించుచు నాయన 475 సూత్రములను మూడు దినములలో రచించెను. తరువాత, అంతకుపూర్వ మారంభించిన "హృదయ కుహర" శ్లోక వ్యాఖ్యాన గ్రంథమును రమణోపదేశముల

వివరణముగా 300 శ్లోకములతో 18 అధ్యాయములలో నాయన పూర్తి చేసెను. అదియే "రమణగీత"గా ప్రసిద్ధమయ్యెను.

అమ్మ యభిలాషను అనుసరించి నాయన దైవరాతునితో 1917 అక్టోబరులో పడైవీడునకు చేరెను. ఆమె అక్కడ 40 దినములు తపోదీక్ష వహించెను. కుమారుడైన మహాదేవునకు వివాహము నిశ్చయమగుటచే 1917 ఫిబ్రవరిలో వారు దైవరాతుని ఇంటికి పంపి ఆశీస్సుల కొఱకు రమణునియొద్దకు వచ్చిరి. అప్పుడు నాయన మహర్షి సోదరునకు సన్న్యాసము నొసంగి నిరంజనానందుడు అను పేరు పెట్టి, ఆయన తల్లి అలఘుమ్మకు కూడ సన్న్యాసము నొసంగెను. తరువాత ఆయన కలువఱాయికి చేరి 15–3–1918 తేది కుమారునకు వివాహమును జరిపించెను. అక్కడ 6 నెలలుండి అరసవల్లి క్షేత్రయాత్ర గావించెను.

ఈ సందర్భమున వాసిష్ఠ వైభవమునందు శ్రీ కపాలశాస్త్రి "సంస్కృతబాషను అధ్యయన మొనరింపని మహర్షియొక్క హృదయమునుండి స్వయముగా పైకి వచ్చిన ''హృదయకుహర" అను శ్లోకము ద్వితీయ విషయముగా వివరింపబడినది'' అని యుద్ఘాటించెను. ''భగవతోఽ నధీత సంస్కృత గిరో మహర్షేః స్వతో హృదయాదుద్గతో ''హృదయ కుహర'' ఇతి శ్లోకో ద్వితీయాధ్యాయత యోపన్యస్తః''(205 ప్రకరణము–20). శ్రీ రమణమహర్షి సంస్కృతమును నేర్చుకొనలేదనుట అసంగతము. ఆయన సంస్కృతమున ఎన్నో శ్లోకములను రచించెను. మఱియును ''హృదయ కుహర''

అను శ్లోకమును మొదలుపెట్టినవాడు శ్రీ జగదీశశాస్త్రి. మహర్షి దానిని పూరించెను.

1918 అక్టోబరులో అమ్మనాయనలు సికింద్రాబాదునకు చేరి 1919 డిసెంబరు నెల వరకు అక్కడ నుండిరి. అప్పుడు స్వరాజ్యము కొరకు ఉద్యమము విజృంభించెను. ఆ నాయకులలో గాంధి ప్రబలుడైయుండెను. గాంధి మైత్రేయ ఋషియొక్క అంశమున జన్మించినవాడని నాయన చెప్పుచుండెడివాడు. ఆస్తి విషయములను చక్కబెట్టుకొనుటకు ఆయన కలువరాయికి పోయి 1920 మే నెల చివర సికింద్రాబాదునకు చేరి 1922 మార్చి వరకు అక్కడనే యుండెను. 1921 జూన్ నెలలో సుధన్వుడు, కపాలిశాస్త్రి నాయన యొద్దకు వచ్చిరి. అప్పుడాయన తన యనుభవములను వారికి చెప్పుచు విఘ్నేశ్వరుని ఉద్దేశించి నాలుగు శ్లోకములను చెప్పెను.

ఆ శ్లోకముల తాత్పర్యము ఇట్లున్నది. "గజాననా! నేను ఘోరతపస్సును చేయకున్నచో అది నీయపరాధమే. నీవు ఏల ప్రేరణ చేయలేదు? నీవు ప్రేరేపించినను నేను తపస్సు చేయలేదన్నచో నీ ప్రేరణకు ఏమి శక్తి యున్నట్లు? నేను కలుషముచే భంగము నొందుచుంటినని మహావిపత్తులో మునుగుచుంటినని ఏల బృంహితధ్వనులను చేసెదవు? నేను నిద్రించుచున్నచో హస్తముతో తట్టి లేపుము. నేను అపమార్గమున పోవుచున్నచో వెంటనే వెనుకకు మరలింపుము. గుహయందున్న యీ చీకటి నేత్రముల శక్తిని హరించుచు నా మార్గమును అరికట్టుచున్నది. చూచుటకు

నేను అశక్తుడనైయున్నాను. ప్రభూ! నాయందు స్నేహము (చమురు) ఉన్నది; దశ (వత్తి) ఉన్నది. దీనిని వెలిగించుటకు దయతో నీ కటాక్ష జ్యోతిస్సును కొంచెము అనుగ్రహింపుము. నేను ముందునకు పోవుదును. "

ఈ బావన అప్పటి అయనయొక్క మనఃపరిస్థితిని చక్కగా వ్యక్తము చేయుచున్నది.

1922 జనవరిలో మహాదేవుడు చదువు వదలి ఉపాధ్యాయుడయ్యెను. నాయన అమ్మతో చెన్నపురము చేరి మార్చి చివర వఱకు నుండెను. అప్పు డాయన శిష్యుల కొఱకు యోగసాధన రహస్యములను సూత్రములనుగా రచించెను. అది తరువాత "రాజయోగసారము" అను గ్రంథమయ్యెను. అప్పుడాయన ఒక సందర్భమున పండితులతో నిట్లనెను. " మంత్రధ్యానము చేతనే నాకు నిరుపాధిక ధ్యానయోగ మలవడెను. అది దైవ కటాక్షమే. ఆ కటాక్షమునకు గురు కటాక్షముకూడ తోడై నాయందా యోగము స్థిరమై, శక్తిని వృద్ధిపరచెను ... ఈ నిర్విషయ విమర్శయోగ మలవడుకొలది, ఈ జగద్వ్యవహారము లెన్నియున్నను నా యాంతర్యమందీ యోగసాధనము నిరంతరము కాజొచ్చెను. ఇది యెప్పుడు సిద్ధి బొందునో చెప్పజాలను."*

---

* నాయన – పుటలు: 493, 494

# 10. కపాల భేదసిద్ధి

1922 ఏప్రిలులో నాయన అరుణాచలమునకు వచ్చెను. చూతగుహకు ముందు గది నిర్మాణము మరమ్మత్తులు జరుగుచుండగా నాయన ఉమా సహస్రమును సంస్కరింప మొదలిడెను. అది ఏడవ సంస్కరణము. పిదప ఆయన ఇరువది రోజులలో దీక్షగా ఇంద్రాణీ సప్తశతిని రచింపవలెనని సంకల్పించెను. కాని రచనము ఆరంభము కాకముందే నాయనకు తీవ్రమైన శిరోబాధ కలిగెను. రెండుదినములు సుమారుగా నుండి మూడవదినము రాత్రికి గొడ్డలితో కొట్టుచున్నంతగా బాధ కలిగెను. దానితోపాటు వెన్నులోనుండి కంఠము పర్యంతము దుర్భరమైన తాపము బయలుదేరెను. నాయన మహర్షి యొద్దకు పోలేక చీటీ పంపెను. మహర్షి మౌనము వహించెను.

అర్ధరాత్రి యగునప్పటికి నాయన శిరస్సునుండి "టప్" అను శబ్దము గుహ వెలుపల కూర్చుండిన విశాలాక్షమ్మకు వజ్రమ్మకు వినబడెను. వారు మిగుల భయపడ జొచ్చిరి. వెంటనే చంద్రకాంతివంటి జ్యోతి ఆయన శిరస్సునుండి వెడలి గుహయొక్క కప్పుపై బింబాకారముగా పడి గుహలోని చీకటిని తొలగించెను. దానితోపాటు ఆయన శిరస్సునుండి ఆవిరివంటి పొగ వెలువడ జొచ్చెను. అప్పుడు నాయన "అమ్మయ్యా" అని నిట్టూర్చి, "శీర్షకపాలములు రెండును భిన్నముగుటకే ఇంత బాధ కలిగినది; అవి భిన్నమైనవి! బాధ పోయినది" అని చెంత నున్నవారితో చెప్పెను. తెల్లవారు నప్పటికి శిరస్సునుండి పైకి వచ్చుచున్న

యావిరి యొక్క వేగము తగ్గెను. ఆ రాత్రియంతయు నాయన అవిరివలన తాపము, లోపల చందన శీతలత్వమును అనుభవించు చుండెను.

తెల్లవారిన తరువాత భగవానుడు చూతగుహకు వచ్చి జరిగిన దంతయు విని సంతసించి స్వయముగా నాయనను గుహలోనుండి గదిలోనికి తీసుకొనివచ్చి మంచముపై కూర్చుండబెట్టి అయనకు పాలను ఇప్పించెను. భగవానుడు నాయన తలను పరీక్షించెను. ఆశ్చర్యముగా అరచేయి మేర జుట్టు అంతయు ఒక్క రాత్రికే ఊడిపోయెను. మహర్షి ఆ శిరస్సును కొంతసేపు నిమిరి, అయనకు సేవ చేయుచున్న చిరుపాకం కొండయ్యను పంపి పాదుకల జత, బాదము తైలము, చిట్టాముదము తెప్పించుచు విశాలాక్షమ్మతో ఇట్లనెను. "నాయనకు ఇంక భయము లేదు. కాని శరీరమంతయు విద్యుచ్ఛక్తితో కూడియున్నది. ఇంక వీరి శరీరము లోహముయొక్క స్పర్శనుగాని, అహారమున ఉప్పుకారములను గాని భరింపజాలదు. వీరు వట్టి నేలపై కూర్చుండరాదు; గదిలోనైన పాదరక్షలు లేకుండ తిరుగరాదు. స్నానమునకు ముందు తలకు బాదము తైలమును, తరువాత చిట్టాముదమును పట్టింపుడు". ఇట్లు చెప్పి మహర్షి తల్లిసేవ చేయుటకై వెడలిపోయెను.

నాయన కపాల భేదనమున కలిగిన యనుభూతులను కొన్నింటిని ఉమా సహస్రమున చేర్చి ఎనిమిదవ పర్యాయము దానిని సంస్కరించి అపీతకుచాంబా సన్నిధియందు పఠించెను. తరువాత నాయన ఇంద్రాణీ సప్తశతిని 20 దినములలో పూర్తి చేసెను.

ఈ రచనా కాలమున గ్రీష్మమునందు కూడ ప్రతి సాయంకాలము ఇంద్రాణీ దేవత విద్యుత్ పరంపరలను చూపుచు తన యనుగ్రహ మును ప్రకటించుచుండెను. నాయన పడైవీడునకు పోయి రేణుకా దేవి సన్నిధియందు ఆ గ్రంథమును పఠించెను. అప్పుడు ఆదేవి సాక్షాత్కరించి వినుచున్నట్లుగా కొందరకు గోచరించెను.

ఆ గ్రంథమున నాయన యొకచోట తన లక్ష్యములను వివరించుచు ఇంద్రాణిని ఇట్లు ప్రార్థించెను.* "స్త్రీల స్వాతంత్ర్య మును రక్షించుట కొఱకు, పంచముల యపారమైన దైన్యమును తొలగించుటకు, ధర్మము పేరుతో ప్రబలుచున్న యధర్మమును హరించుటకు, గంభీరమైన వేదార్థమున సందేహములను దీర్చుటకు, ఘోరమైన వర్ణభేదమును నాశ మొనరించుటకు, అమ్మా! నా బుద్ధికి శక్తికి మహోల్లాసమును ప్రసాదింపుము".

శ్లో॥ స్వాతంత్ర్యం వనితానాం త్రాతుం మాత రధీశే
దూరీకర్తు మపారం దైన్యం పంచమజాతేః
ధర్మవ్యాజ మధర్మం భూలోకే పరిహర్తుం
వేదార్థే చ గభీరే సందేహా నపి హర్తుం
ఘోరం వర్ణవిభేదం కర్తుం చ స్మృతిశేష
ముల్లాసం మతిశక్త్యో ర్మహ్యం దేహి మహాంతమ్॥

---

*జయంతి సంచిక – వాసిష్ఠుని ఇంద్రాణి – డాక్టర్ ప్రసాదరాయ కులపతి M. A., Ph. D. - పుట. 56.

భారత దేశ దుర్గతికి నాయన ఎంతగా పరితపించు చుండెనో ఈ గ్రంథమున అక్కడక్కడ వ్యక్తమగు చున్నది. "శత్రు భారముచే ఖిన్నమైయున్న భారత దేశమును రక్షించుటకు, ఓ తల్లీ! నాకు బలము ఇమ్ము. దుర్మార్గుల వినాశము కొఱకు నాకు నీవు అస్త్రముగా నుండుము; నా బుద్ధిని శక్తివంత మగునట్లు చేయుము. భారత దేశ దుర్గతిని చూచుచు దుఃఖమును పొందుచున్న నాకు యోగ మదము (సిద్ధి) వలన తృప్తి కలుగుట లేదు." *

19–5–1922 న భగవానుని తల్లి అలఘమ్మ నిర్యాణము నొందెను. ఆమె సమాధిపై మహర్షి లింగాకారముతో వున్న యొక శిలను ప్రతిష్ఠించెను. దానికి "మాతృ భూతేశ్వర లింగము" అని నాయన నామకరణ మొనరించెను. పిదప నాయన మూత గుహలో నాలుగు నెలలు తపస్సు చేసెను. 1923 ఫిబ్రవరి ముగియు నప్పటికి ఇంద్రాణీ సప్తశతిలోని శ్లోకములను సుమారుగా నాలుగు వందలు ఉమాస్తుతిలో చేర్చి సహస్రముగా శుద్ధప్రతి వ్రాసి రమణునకు సమర్పించెను. 1942 లో ముద్రింపబడిన యీ గ్రంథమునకు ఈ ప్రతియే ఆధార మయ్యెను. అయన ఉమాస్తుతి నుండి కొన్ని శ్లోకములను ఇంద్రాణీ సప్తశతి యందు చేర్చి కొన్ని క్రొత్త శ్లోకములను కూడ కూర్చి దానిని గూడ తీర్చి దిద్దెను.

---

* నాయన పుటలు – 530, 531.

# 11. దేశోద్ధరణ ప్రచారము

1923 డిశంబరులో కాకినాడ యందు జరిగిన అఖిల భారత కాంగ్రెసు మహాసభలకు శ్రీ బులుసు సాంబమూర్తి నాయనను ఆహ్వానించెను. అక్కడ స్త్రీల హక్కులను గూర్చి యొక సభ ఏర్పాటయ్యెను. అందులో ఉపనయనము, హోమము, శ్రాద్ధము మొదలగు వానిలో పురుషులతోపాటు స్త్రీలకు సమాన హక్కు కలదని, నాయన వేదశాస్త్ర ప్రమాణములతో నిరూపించెను. తరువాత అలమూరులో అస్పృశ్యతా నివారణమును గూర్చి జరిగిన సభకు నాయనను అధ్యక్షునిగా వరించిరి. క్రైస్తవులు మొదలుగా ఇతర మతములవారి విషయమున స్పర్శదోషము సడలింపబడుచున్నప్పుడు మన మతమునకు చెందిన పంచములయెడ సడలించుకొనక ఆర్భాటములు సలుపుట హాస్యాస్పదమని నాయన ఉద్ఘాటించెను. ఆచారవంతులు తమ యాచారమును తమ యింటి వెలుపల నున్నవారు మన్నించ వలెనని నిరంకుశులై ప్రవర్తించుట తగదనియు ఆయన అధ్యక్షుడుగా ఉద్బోధించెను. అక్కడ నుండి తిరువణ్ణామలైకి పోవుచు ఆయన కొన్ని గ్రామములలో ఈ భావములను బోధించెను. మల్లాది శ్రీకృష్ణచయనులు అను పండితుడు నాయన వాదమును ఖండించుచు వ్యాసములు వ్రాయగా, నాయన వానికి అన్నింటికి సమాధానములు వ్రాసి ఆయనను నిరుత్తరుని గావించెను.

రాజకీయములలో చేరుటకు ఇష్టము లేకున్నను కార్యకర్తల యొత్తిడి వలన వాసిష్ఠుడు ద్రవిడ రాష్ట్రీయ కాంగ్రెసునకు 1914లో అధ్యక్షుడయ్యెను. ఆ సంవత్సరము డిసెంబరులో బెల్గాముసందు కాంగ్రెసు మహాసభలో పాల్గొని ఆయన అస్పృశ్యతా నివారణము

శాస్త్రసమ్మతమని సంస్కృతమున ఉపన్యసించెను. మఱునాడు హిందీ జాతీయ భాష కావలెనని గాంధిచే ప్రతిపాదింపబడిన తీర్మానమును ఖండించుటకు నాయన పూనుకొనెను. క్రిందటి దినము తమకు అనుకూలముగానున్న ప్రసంగమునకు ఆనందించిన గాంధి తన ప్రతిపాదనమును కాదన్న వాసిష్ఠుని ప్రసంగింపకుండ నివారించెను. అనుమతి లభించియున్నచో ఆ సభలో వాసిష్ఠుడు మనకు సంస్కృతమే జాతీయ భాషయని ఉద్ఘాటించి యుండెడి వాడు. నాయకులు అభిప్రాయ భేదమును కూడ సహింప లేకున్నారని గ్రహించి వాసిష్ఠుడు వెంటనే సభ్యత్వమునకు రాజీనామాను ఇచ్చి రాజకీయముల నుండి బయల్పడెను. అయినను ఆయన దేశభక్తిని వీడక రాష్ట్ర విభాగములను గూర్చి "రాష్ట్ర నిబంధనము" అను గ్రంథమును రచించెను.

సంస్కృతము ప్రపంచ భాష కావలెనని నాయన "లాలి భాషోపదేశః" అను గ్రంథమును కూడ రచించినాడు. దాని ప్రాశస్త్యమును శ్రీ అప్పల సోమేశ్వర శర్మ ఇట్లు ఉద్ఘాటించినాడు. "అటువంటి మహానుభావుని బహుసంఖ్యాక రచనలలో 'లాలి భాషోపదేశం' ఒకటి. సంస్కృత భాషను దేశ కాలానుగుణంగా సంస్కరించి, పునరుజ్జీవనాన్ని సౌలభ్యాన్ని ప్రచారాన్ని సంపాదించి దానికి ప్రపంచ భాషా సామ్రాజ్య పట్టాభిషేకాన్ని చేయాలని ఈ రచన తహతహలాడుతుంది. 'లాలి భాష' అన్న పేరే బహు చిత్రంగాను, మధురంగాను వుంది....... 'లాలి పాట' లాగా 'లాలి భాష' సర్వజనావర్జకం అవుతుందని, కావాలని గ్రంథకర్త అభిసంధి అయి వుండవచ్చు....*

---

* జయంతి సంచిక పుట 12

ప్రపంచములో ఈనాటికీ ఏ కొంచమైనను మనకు గౌరవము వున్నదన్నచో, అది అనాదియైన వేదశాస్త్ర విజ్ఞానము వల్లనేకాని మన యార్థిక సంపదవలన కాదు. రాజకీయ సామర్థ్యమువలన కాదు. ఆ వేదశాస్త్ర విజ్ఞాన భాండాగారమునకు సంస్కృత భాషయే తాళపు చెవి. దానివలన తప్ప మఱియే సాధనమువలన మనకు ఆ విజ్ఞానము నందు ప్రవేశము కాని, దేశ సమైక్యము కాని, అభ్యుదయము కాని, ప్రపంచమున గౌరవ ప్రపత్తులు కాని ఏర్పడవు.

బెల్గాము నుండి నాయన గోకర్ణమునకు వచ్చి దైవరాతుని యింట రెండు నెలలు, బొంబాయిలో ఒక నెల శిష్యులయొద్ద నుండి తిరువణ్ణామలై చేరెను. 1925 జులై నుండి మూడు నెలలు నాయన అతిమూత్ర వ్యాధితో బాధపడెను. అయన చూత గుహలో వుండి పెక్కు సూత్ర గ్రంథములను, విశ్వ మీమాంస అను 393 శ్లోకముల గ్రంథమును రచించెను. ఆ సమయమున సుబ్రమణ్య అయ్యరు అనునొక కాంగ్రెసు సభ్యుడు అన్ని జాతుల విద్యార్థులకు ఏక పంక్తి భోజనములను ఏర్పఱచుచు ద్రవిడ దేశమున శర్మ దేవీ క్షేత్రము నందు ఒక గురుకులమును నెలకొల్పెను. అందు అయన బ్రాహ్మణుని వంటవానినిగా నియమించెను. ఆ విషయమును బ్రాహ్మణేతరులు అక్షేపించిరి. ఆ వివాదము పరిష్కారము కొఱకు నాయన యొద్దకు వచ్చెను. "పంచముని వంటవానినిగా వుంచుట పరిష్కారము" అని నాయన తీర్పు చెప్పెను. అది బ్రాహ్మణేతరులకు కూడ నచ్చలేదు. ఇంతలో హఠాత్తుగా సుబ్రమణ్య అయ్యరు మరణించి ఆ గురుకులము మూలబడెను.

1925 నవంబరులో నాయన బందరులో సనాతన ధర్మ సభయందు సంస్కరణముల యావశ్యకతను గూర్చి ప్రబోధించి అటనుండి మంగళగిరికి పోయి ఆ నృసింహక్షేత్రమును ఇంద్ర క్షేత్రముగా గుర్తించెను.

1926లో వాసిష్ఠుడు తిరువణ్ణామలైకి వచ్చి "పూర్ణ" అను కల్పిత కథను నవలగా సంస్కృతమున ఆరంభించెను. ప్రతిసాయంకాలము రచించినంతవఱకు ఆ కథను నాయనకోవెల యందు వినిపించుచుండెను. 1926 ఏప్రిలులో దైవరాతుడు, వాసిష్ఠుని గ్రంథముల ప్రకాశనము కొఱకు శిరసి అను గ్రామమున ఒక ముద్రణాలయమును కొని "నందినీ" ముద్రణాలయమను పేరుతో నాయనకు అర్పించెను. అంతకుముందే అతడు 1925లో గోకర్ణములో ఆశ్రమమును స్థాపించి దానియందు గురుస్థానమును స్వీకరింపవలసినదని నాయనను ఆహ్వానించి యుండెను. ఆ సమయమునకు అమ్మకు పాండురోగము వలన ఆరోగ్యము క్షీణించుచుండుటచే నాయన అచ్చటికి పోలేకపోయెను. 18–7–1926 నుండి విశాలాక్షమ్మ మంచము పట్టి 26వ తేది పరమపదించెను. అప్పుడు నాయన సన్న్యసించునని అనేకులు తలంచిరి. కాని ఆయన తుదివఱకు యజ్ఞోపవీతమును వీడలేదు.

గణపతిమునియొక్క సంస్కారభావములు రమణాశ్రమ లక్ష్యమునకు విరుద్ధములని, ఆయన శిష్యులకు శక్తి సంపాదనమే ధ్యేయమని, మహర్షికి నాయనకు లక్ష్యములలో భేదమున్నదని కొందఱు ప్రచారము చేయ జొచ్చిరి. అందులకు గణపతి

చలింపలేదు; రమణుడు తాటస్థ్యమును వీడలేదు. అందువలన గణపతిముని శిష్యులు కొందఱు శ్రీఅరవిందాశ్రమమునకు చేరిరి.

1927 ఫిబ్రవరిలో సికిందరాబాదులో జరుగబోవుచున్న శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయముయొక్క రజతోత్సవములకు కార్యకర్తలు వాసిష్ఠుని అధ్యక్షునిగా వరించి ముందుగానే రమ్మని ఆహ్వానించిరి. అందువలన నాయన జనవరిలోనే అక్కడికి చేరెను. సికిందరాబాదులో నాయన పెక్కుచోట్ల ఉపన్యసించి మహర్షి సందేశమును ప్రసరింపజేసెను. వేలకొలది జనులకు ఆయన మంత్రదీక్షల నొసంగెను. రజతోత్సవములకు అధ్యక్షత వహించుచు వాసిష్ఠుడు, మన నాగరికత యంతయు వేదవాఙ్మయముపై ఆధారపడియున్నదని, దానిని స్వాధీన మొనర్చుకొనుటకు ఆంధ్రులు సంస్కృతమును మొదట అభ్యసింపవలయునని, పెక్కు సంవత్సరములు గ్రంథములను పఠించినవానికంటె, కొన్నిమాసములు తపస్సు చేసినవాడు అధికముగా వాక్కుయొక్క శక్తిసంపదను పొందునని, మహాకవులందఱు తపస్సుచేతనే మహా గ్రంథములను రచించిరని, వివిధ ప్రాంతములలో భావికాలమున మన భావములు ప్రజలకు చక్కగా బోధపడవలయు నన్నచో గ్రంథములను గ్రాంథికభాషలోనే రచించుట అవశ్యకమని ప్రబోధించెను.

నాయన ప్రబోధించిన గ్రాంథికభాషయొక్క అవశ్యకతను వ్యావహారికభాష వలన కలుగుచున్న యనర్థమును ఆంధ్రులు గుర్తింప కుండుట అత్యంతము శోచనీయము, గ్రాంథికశైలివల్లనే నన్నయభట్టునుండి చిన్నయసూరి వఱకు రచింపబడుచుండిన

గ్రంథములు అన్ని ప్రాంతములలో అన్ని తరములవారికి చక్కగా బోధపడుచు విజ్ఞానమును అందించుచుండినవి. తిక్కన్నగారు నెల్లూరి మాండలికములో, పోతన్నగారు ఓరుగంటిలోని వ్యావహారిక భాషలో గ్రంథములు వ్రాసియుండినచో అవి ఈనాటికి మనకు నిరుపయోగములై యుండెడివి. వారు గ్రాంథికశైలిలో వ్రాయుట వలననే భారత భాగవతములు ఈనాటికీ దేశమున అన్ని ప్రాంతములలో సజీవములై యున్నవి. గ్రాంథిక మన్నంతనే సమాస జటిలమైన భాష యని గ్రహింపరాదు. గ్రాంథికశైలిలో వచనమే కాదు, పద్యములను కూడ ఎంత సులభముగానైన రచింపవచ్చును. "ఇందు గల డందు లేడను సందేహము వలదు" మొదలైన పద్యములే ఇందులకు నిదర్శనము. వేమన పద్యములు ఎంత సులభములో అందఱు ఎఱిగినదే.

దినపత్రికలలో ఆంగ్లమును అత్యంతము పటిష్ఠమైన భాషలో వ్రాయుచు చదువుచు ఆనందించుచున్న నేటి బుద్ధిమంతులు మాతృభాష విషయమున మాత్రము నోటికివచ్చినట్లు వ్రాయుచుండుట చాల శోచనీయము. పరభాషయందున్న శ్రద్ధ మాతృభాషయందు కూడ ఉండవలయు నని ఈ మేధావులకు ఏల తోచదో తెలియదు. శుచిగా రుచిగా వండిపెట్టుటకు బద్ధకించి బజారులోని చిఱుతిండిని చిన్నపిల్లలకు మఱపినట్లు, తమ సోమరితనమువలన ఈ రచయితలు జనులకు పామరభాషను పత్రికలలో మఱపి వారి హితమును పాటింపక వారికి గ్రాంథికశైలి యన్నచో ఏవగింపు కలుగునట్లు చేసి, మన పూర్వవిజ్ఞానమునకు దూర మొనరించి వారికి తీరని ద్రోహమును చేయుచున్నారు.

పత్రికలవారు కొంత భాగమైనను సరళ గ్రాంథిక రచనలకు కేటాయించి, ప్రజలకు పూర్వవాఙ్మయముతో సంబంధము తెగకుండునట్లు చేయుట ఆవశ్యకము.

25-2-1927 తేది హైదరాబాదులో ఆదిహిందూసంఘము వారు (హరిజనులు) శ్రీ మాడపాటి హనుమంతరావు గారి గృహము నుండి నాయనను పల్లకీలో ఊరేగించుచు వారి హాస్టలునకు తీసికొనిపోయి "ముని" బిరుదము నిచ్చి సత్కరించిరి. సమ్మానపత్రమును భాగ్యరెడ్డి గారు చదువగా వామన నాయక్ గారు శాస్త్రిగారికి సమర్పించిరి.*

1927 జులైలో నాయన మరల అరుణాచలమున చూతగుహకు చేరెను. శ్రీఅరవిందుడు శ్రీమాతయందు '' కాళి '' యొక్క అవతరణమును సాధించెనని ఆమె దివ్యశక్తులను కపాలి నాయనకు వర్ణించి చెప్పి తన చర్యను సమర్థించుకొనెను. కాని నాయన కపాలి అభిప్రాయములను అంగీకరింపలేదు.

1927 డిసెంబరులో చెన్నపురములో జరుగుచున్న పండితసభకు నాయనకు ఆహ్వానము వచ్చెను. అది నిమిత్తముగా నాయన చెన్నపురమునకేగెను. ఆ పండితసభవారు వాసిష్ఠుని ఆదరింపలేదు.

---

*జయంతి సంచిక – ఆదిహిందువు లిచ్చిన సమ్మానము – శిరుగూరి జయరామ్ – పుట–3

అప్పుడక్కడికి పండిత మదనమోహన మాళవీయుడు కూడ వచ్చి యుండెను. ఆయన అధ్యక్షుడుగా హిందూ హైస్కూలులో ఒక మహాసభ ఏర్పాటు కావింపబడెను. ఆ మహాసభలో నాయన వర్ణాశ్రమ సంఘము యొక్క పండితవర్గమువారి వాదములను ఖండించి అస్పృశ్యతా నివారణము యొక్క అవశ్యకతను నిరూపించుచు సంస్కృతమున మహూపన్యాసమును కావించెను. మాలవీయ పండితుడు నాయనను ఎంతగా అభినందించినను ఆ పండితులు ఔదాసీన్యమునే వహించిరి. వారు తొలుత తనకు గావించిన యనాదరమును తలంచుకొనుచు అప్పటినుండి "పండితసభకింక వెళ్ళరాదనియు, వారిని సంస్కరించుటకు యత్నించి, పరాభవింపబడుటకంటె వారు కాలగతిచే పరాభవింపబడు వఱకు వారిని విడిచినచో వారే సంస్కారమును పొందుదురనియు నాయన నిశ్చయించుకొని తన తపస్స్థలమునకు మఱలెను."*

ఈ సమయముననే ఓరుగంటి వేంకట కృష్ణయ్య నాయనకు శిష్యుడయ్యెను. మద్రాసులో పరశువాకములో యన్. దొరస్వామయ్యరు గారి యింట నాయన అతిథిగా నుండగా కొందఱు అయనను దర్శించుటకు వచ్చిరి. అప్పుడు చతుర్వేదుల వేంకటకృష్ణయ్య నాయనకు పాదము లొత్తుచుండెను. అప్పుడు నాయన పితృకర్మల యావశ్యకతనుగూర్చి చెప్పుచు కనీసము తద్దినమునైన తప్పక పెట్టవలయునని యుద్ఘాటించుచుండెను. చతుర్వేదుల వేంకటకృష్ణయ్య

---

*నాయన – పుట 584

నెల్లూరు సమీపమున పల్లెపాడులో విప్రవిద్యాలయమును స్థాపించి మిగులనైష్ఠికుడై యుండిన చతుర్వేదుల రాఘవయ్యగారి కుమారుడు. తండ్రి ఎంతో ఆచారపరుడైనను వేంకట కృష్ణయ్య గాంధీగారి యాశ్రమములలో చేరి సకల కర్మలను వదలుకొనెను. అందువలన అతడు నాయనతో ఇట్లనెను. "మీరు కర్మలు చేయువలెనని చెప్పుచున్నారు. బాగానేయున్నది. నేను గాంధీగారి యాశ్రమములో అన్నిజాతులవారితో కలిసి భోజనము చేసినవాడను. నేను తద్దినము పెట్టవలెనన్నచో ఏ బ్రాహ్మణుడు వచ్చి నాచేత తద్దినము పెట్టించును? రేపే మాతల్లి తద్దినము." "నీకు పెట్టవలయునని శ్రద్ధ యున్నచో నేనే పెట్టింతును" అని నాయన అనెను. అందఱును దిగ్భ్రాంతులైరి. "భోక్త లెక్కడ దొరుకుదు" రని వేంకట కృష్ణయ్య అనెను. వెంటనే నాయన ఎదుట కూర్చుండి యున్న వారిని కలయజూచి ఓరుగంటి వేంకట కృష్ణయ్యను ఒక భోక్తనుగా ఉండుమని చెప్పి, అగ్నిహోత్రుడే రెండవభోక్త అగునని నెను. ఈ సందర్భమును ఓరుగంటి వేంకట కృష్ణయ్య ఇట్లు వివరించెను.

"మఱునాడు శ్రాద్ధ కార్యము నెఱవేరినది. నాయన మంత్రోచ్చారణము చేయుచుండగా కష్టసహములైన ( కష్టముతో సహింపదగినవి ) శక్తి తరంగములు నా యొడలిలో ( శరీరములో ) ప్రవహించుచుండినవి. పురోహితుడు నాయన. ఆయనకు నే నను చరు డగుట యదియే ప్రారంభము.

ఈ యుదంతమున నిర్ణీతాంశము లేమి?

1) లోకములు, మరణానంతరానుభావ్యము ( మరణమునకు పిమ్మట అనుభవింపదగినవి ) లున్నవి. పితృలోకములు కలవని వేఱుగా చెప్ప నక్కరలేదు కదా.
2) దేహ నాశనముతో వ్యక్తి నశింపదు. సూక్ష్మోపాధులతో ( ఉపాధులు–శరీరములు) అయా లోకముల చరించుచుండును.
3) ఆ జీవికి ప్రేతత్వదశ యందేమి పితృస్వరూప దశయందేమి తృష్ణ లుండును.
4) సంతతివారు శాస్త్రోక్తములైన కర్మల నొనరించి ఆ జీవి కుద్గతి (ఉద్గతి – పైకి పోవుట) నీయగలరు.
5) శాస్త్రోక్తముగా నాయా కార్యములను మంత్రయుక్తముగా ఒనరింపవలయును; మంత్రరహితముగా గాదు. అనగా స్వరయుక్తమంత్ర సహితముగా"*

పై యుద్ధరణములో (Quotation) కుండలీకరణములలో నున్న యర్థములు నే నొసంగినవి.

ఓరుగంటి వేంకట కృష్ణయ్య నాయన గారి శిష్యులలో వలె శ్రీ రమణమహర్షి శిష్యులలో కూడ ప్రముఖుడే. ఈ యనుబంధమును ఆయన ఇట్లు వివరించెను.

"భగవాను నొకసారి నే నడిగితిని. వేదమంత్రములకు భావన ప్రధాన మందురు. గాయత్రీ మంత్రమును జపించు మంటిరి.

---

* "నాకు తెలిసిన నాయన" కృష్ణభిక్షు – కావ్యకంఠ గణపతి ముని జయంతి (సంచిక) 1979–పుటలు–7,8

దాని యర్థముగా ఎన్నో భావములు రావచ్చును గదా.
యెట్లు వచ్చును. ఐకాగ్ర్యం హి తపః అన్నారు గదా. అతి
తీక్ష్ణము నైన స్వరముతో భగవాను చీవాట్లు పెట్టిరి. భా
భావన! అర్థభావన నేను చేయమన్నానా? ఎవడు జపమ
చున్నాడో ఆ వానిని జూడుమన్నానా? సాక్షాత్తుగా నీ ఉపదే
నా కెన్నడును మహర్షి చేయలేదు. వారు చేసినది, మ
పాదులు నాయనకు. మీ గురువునకు చెప్పినచో నీకు చె
కాదా అని వారి చీవాట్లు.'' జయంతి సంచిక – పు

1927 ఫిబ్రవరిలో హైదరాబాదులో నాయనకు
బిరుదముతో సత్కారము జరిగిన తరువాత జులైలోగాని
రమణాశ్రమమునకు తిరిగి రాలేదు. ఈ లోపల ఆ సభ
వలన కలిగిన ప్రతిస్పందనములను గూర్చి గుంటూర
కాంతము ఇట్లు వ్రాసెను. '' ఇంతగా కొనియాడబడిన
యొక్క మహోన్నతిని గురించి వినినప్పుడసూయాప
భావోద్రేకములను తిరువణ్ణామలలో బొందిరో తెలియద
ఈవార్తలు అప్రాంతముచేరులోపున సుధన్వ కపాలులు శ్రీఆ
శ్రమమున చేరి నాయనను నిరసించిన వారికి బలము, నా
సంతోషాతిశయభంగము చేకూర్చిరని మాత్రము సికిం
హైదరాబాదు శిష్యులకు తెలిసెను.*

*నాయన – పుటలు – 577, 578.

శ్రీ రమణ మహర్షి శిష్యులకు నాయన విషయమున అభిప్రాయభేదములు కలుగుటకు హేతువులు ఓరుగంటి వేంకట కృష్ణయ్య మాటలలో సూచితము లగుచున్నవి; "నాకు తెలిసిన నాయన సనాతన ధర్మావలంబికాడు. ఆధునిక సంస్కర్తకాదు. ఆయన మార్గ మాయనదే. మురారే స్తృతీయః పంథా" (మురారి కవిది మూడవత్రోవ).

మల్లాదివారితో ఆయనకు చండాలుల దేవాలయ ప్రవేశ విషయమున జరిగిన ప్రచండయుద్ధ మంద జెరిగినదే. ఆయన జాతి చండాలత్వ మొప్పడు. వర్ణములు జాత్యా అను సనాతనుల మత మొప్పడు అట్లే వేదములందలి పంచజన శబ్ద మావర్ణమున కాయన అన్వయింపడు. ఆచారవిషయమున గూడ"*

వేంకటకృష్ణయ్యొ మిత్రులతో ప్రసంగించునప్పుడు, "మా గురువు గారు మహాపండితుడు. నేను అల్పజ్ఞుడను. అయినను మహర్షుల యభిప్రాయమునకు భిన్నముగా వారు చెప్పునప్పుడు నేను మహర్షుల యభిప్రాయమునే గ్రహింతును గాని నాయనగారి యభిప్రాయములను అంగీకరింపను" అని స్పష్టముగా చెప్పు చుండెడివారు.

దీనిని బట్టి నాయన యభిప్రాయములు కొన్నియెడల శిష్యులకే కాక గురువైన మహర్షికి కూడ నచ్చ లేదని వ్యక్తమగు చున్నది.

---

* జయంతి సంచిక పుట–7

9-3-1927 తేది సంచికయందు గోల్కొండ పత్రికలో ప్రకటింపబడిన ప్రశ్నోత్తరములలో నాయన యభిప్రాయములు కొన్ని యిట్లున్నవి.

ప్రశ్న: హిందువులకు సామాన్యధర్మములెవ్వి ?

ఉత్త : వేదముల నమ్ముట, వానిలో నందరికిని సమానాధికార మిచ్చుట. ఈ రెండు సమకూడిననే కాని అందరికి విశ్వాసము కలుగదు. క్రైస్తవుడు బైబిలు నెట్లో హిందువు సంహితము (సహితము) వేదము నట్లు భావించవలయును.

ప్రశ్న: కులభేదము లుండవలయునా?

ఉత్త : అందరు బ్రాహ్మణులే కావలయును. అట్లగువరకు చాతుర్వర్ణములలో అంతశ్శాఖాభేదములు పూర్తిగా పోవలయును. ఇందు హెచ్చుతగ్గులు పాటింపకూడదు. ఆచారముల యొక్క సామ్యత యుండిననే బ్రాహ్మణత్వము కలుగును.

ప్రశ్న: స్మృతులిప్పుడు వ్రాయవచ్చునా ?

ఉత్త : వ్రాయవచ్చును.

ప్రశ్న: వాని నాచరణములో నుంచు టెట్లు?

ఉత్త : ఒక పరిషత్తు ఏర్పడవలయును. అదియే శాసింపవలయును.

ప్రశ్న: బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్యను పరిష్కరించుటెట్లు?

ఉత్త : అందరికిని వేదాధికార మిచ్చుటచేతనే.

ప్రశ్న: శూద్రుల విషయమై కొన్ని స్మృతులలో వేదాధికారాదులు లేనట్లు వ్రాసియున్నారు. దీని నెట్లు సమన్వయింతురు?

ఉత్త: అట్టివానియందలి ధర్మములు సామయాచారిక ధర్మములు. రాగద్వేషములతో గూడినట్టి స్మృతులు ప్రమాణము గానేరవు. శృతికి విరుద్ధమైన స్మృతులు ప్రమాణములు కావు. వేదాధికారము లేదని వ్రాయు సూత్రములు ద్వేష యుక్తము లయినవి. మరియు వేద విరుద్ధ ములగుటచే అప్రమాణము లయినవి.

ప్రశ్న: భోజనములందు అందరును కలిసి భుజింపవచ్చునా? (Interdining)

ఉత్త: శాస్త్రాక్షేపణను ఈ విషయమున లేదు. ఆచారమే ఆటంకము కలిగించుచున్నది. దాక్షిణాత్యులలో నీ యాచారము తీక్షణముగా నున్నది.

ప్రశ్న: హిందూసంఘముయొక్క పరమావధి ఎట్లుండును?

ఉత్త: అందరును వేదముల జదివి యజ్ఞోపవీతధారణ మొనర్చు టయే దాని పరమావధి.''*

ఇట్టి ప్రశ్నోత్తరములలోనే భగవానుని యభిప్రాయములు ఇట్లున్నవి.

---

*జయంతి సంచిక - పుటలు 73, 74, 75

ఆ రోజుల్లో కుంజుస్వామీ రామనాథయ్యరూ పలాకొత్తుకు పోయే దారికి ప్రక్కగానున్నరూములో వుండేవారట. ఉభయులూ భోజనం చేసి వసారా తిన్నెమీద కూర్చుని ఇష్టాగోష్ఠిగా మాట్లాడుకుంటూ ప్రసంగ వశంగా 'ఇదిగో కుంజుస్వామీ! రేపటి నుండి మీరున్నూ వేదాధ్యయనం చేయవచ్చును. భగవాన్ తీర్మానం చేశారీవాళ' అన్నారట రామనాథయ్యర్. వారు ఆమాట అంటూ వుండగానే భోజనానంతరం పలాకొత్తుకు వెళ్ళి తిరిగివచ్చే భగవాన్ వారిని సమీపిస్తూ 'ఆ – నేనా తీర్మానం చేసింది! అధ్యయనం చేయ వచ్చును అని నే ననలేదే?' అన్నారట భగవాన్.

వాళ్ళిద్దరు ఉలిక్కిపడి లేచారట. రామనాథయ్యర్ చేతులు జోడిస్తూ 'భగవాన్! ఇంతకు ముందే హాల్లో శంకరం వ్రాసిన చరిత్రలో అన్ని జాతుల వారున్నూ వేదాధ్యయనం చేయవచ్చు నన్నది సరిచూచారు గదా?' అన్నారట. 'అవును చూచాను. అభ్యాసమని దిద్దాను గదా' అన్నారట భగవాన్. 'అధ్యయనానికీ అభ్యాసానికి భేదం వున్నదా?' అన్నారట అయ్యర్. 'లేకేమి వేద మంటే జ్ఞానమని యర్థం. అందువల్ల వేదాభ్యాసం చేయవచ్చు నన్నమాట. అంతేగాని వేదాధ్యయనం చేయవచ్చునని నే నన లేదే' అన్నారట భగవాన్.*

---

* శ్రీ రమణాశ్రమ లేఖలు – సూరి నాగమ్మ పుటలు 631, 632.

"కొంత కాలం క్రిందట సుందరమయ్యరుకు (భగవాన్ తండ్రి) బంధుకోటిలో చేరిన యువకు డొకడు వివాహం వద్దని తల్లిదండ్రులతో వాదించి తాత్కాలిక వైరాగ్యంతో ఇక్కడికి వచ్చాడట. వస్తే వచ్చాడు ఉన్నన్నాళ్లు వుంటాడు పోనీలే అని చూస్తే మొదట్లోనే ఒక దినం బ్రాహ్మణేతరుల పంక్తిన భోజనానికి కూర్చున్నాడట. సర్వాధికారి కది సరిపడక బ్రాహ్మణ పంక్తికి రమ్మంటే వినక 'భగవాన్ సన్నిధిలో జాతి భేదం ఎందుకు?' అన్నాడట. 'భగవాన్ అంటే అన్నీ వదలుకొన్నారు గనుక సరిపోయింది. నీ కెందుకది. మీ తల్లిదండ్రులు వింటే ఏమంటారు అని సర్వాధికారి హితంగా బోధిస్తే అతడు వినక వాదింప సాగాడట. వాదన ముదిరింది. భగవాన్ సాక్షి మాత్రంగా ఊరుకుంటే ఆ యువకుడు ఆగలేక శ్రీవారిని సమీపించి 'భగవాన్ సన్నిధికి వచ్చిన వెనుక జాతి భేదం పోవద్దా?' అన్నాడట.

"ఓహో! నీకు ఇదొక్కటేనా మిగిలింది. అన్నీపోయినవన్న మాటేనా? అన్నీ పోతే ఇదీ పోవచ్చునోయ్, పోవచ్చు నేమిటి? దానంతట అదే పోతుంది. ఏం? అన్ని భేదాలు పోయినవా నీకు' అని ప్రశ్నించారట భగవాన్. ఆ యువకు డంతటితో కుక్కిన పేనల్లే పలక్కుండా బ్రాహ్మణ పంక్తికి వచ్చి కూర్చున్నాడట.*

"మహర్షితో సంభాషణములు" (Talks with Maharshi) అను గ్రంథములో మరికొన్ని విశేషము లున్నవి.

---

* శ్రీ రమణాశ్రమ లేఖలు – సూరి నాగమ్మ పుటలు 634, 635.

13-2-1936 తేది వేదపఠనము ముగిసిన తరువాత అనంత పురము నుండి వచ్చిన యొక పెద్దాయన లేచి మహర్షి నిట్లు అడిగినాడు. 'బ్రాహ్మణేతరులు వేదమును వినరాదని చెప్పబడి యున్నది.'

మహర్షి :- నీ సంగతి నీవు చూచుకొనుము. నీ వెందులకు ఇక్కడికి వచ్చితివో ఆ విషయమున శ్రద్ధ వహింపుము. ఈ విషయ ములతో ఏల కాలమును వ్యర్థము చేయుదువు? 'నేను వేద పఠన మును విన్నాను' అని నీవు అనుచున్నావు. ఆ నేను ఎవరు?... ముందు ఆ 'నేను' ను కనుగొనుము. తరువాత తక్కిన విషయ ములు మాటాడ వచ్చును.

కొంత సేపైన తరువాత మహర్షి మరల ఇట్లనెను. 'అనాది కాలము నుండి ప్రపంచములో అనేకులు, 'స్మృతులు ఏవో విషయములను చెప్పుచున్నవి. అవి ఈ కాలమునకు తగవు. నేను ప్రపంచమును సంస్కరించెదను. స్మృతులను తిరుగ వ్రాయు దును' అని గంతులు వేయుచునే యున్నారు. అట్టి సంస్కర్తలు వచ్చినారు పోయినారు. కాని ప్రాచీనములైన స్మృతులు నిలిచియే యున్నవి. అట్టి విషయములపై కాలమును వ్యర్థ మొనర్చుట యెందులకు? ప్రతి వ్యక్తి తన పనిని తాను చూచుకొను చున్నచో అంతయు చక్కగానే యుండును.

13 th February 1936-

161. An elderly man from Anantapur, after hearing Veda recital in the hall, stood up and asked: "It is

said that the non-Brahmins should not hear the recital of the Vedas."

Maharshi:- Mind your business. Take care of what you came here for. Why do you waste your time in these matters. "I heard the recital you say." Who is that 'I'--Find the 'I' first and you may after wards speak of other matters."

Continuing Sri Bhagavan said:

"The Smrithis say some thing. They are not appropriate now. I will reform the world, rewrite the Smrithis"- saying so people are cutting Capurs in the world from time immemorial. Such reformers have come and gone; but the ancient Smrithis stand. Why waste time over such matters? Let each one mind his business. All will be well.°

22 ఆగష్టు 1938.

507, ఒక అర్య సామాజికుడు బెంగుళూరు నుండి ఒక సహచరునితో వచ్చి మహర్షిని దర్శించెను. అతడు ఇట్లడిగినాడు.

అర్యసామాజికుడు :- నేను వర్ణ వ్యవస్థను అంగీకరింపను. మహాత్మునియొక్క (మహర్షియొక్క) అభిప్రాయము మార్గదర్శకముగా విలువ కలిగినది. నా ప్రయత్నములలో మీ యాశీస్సులను కోరుచున్నాను.

మహర్షి :- నీ స్వరూపమును విచారించి కనుగొనుమని మహాత్ముడు (మహర్షి) చెప్పుచున్నాడు. నీవు ఆ పనిని చేయుము. నీకు ఆయన యొక్క ఆశీస్సులైనచో కావలె.

° Talks with Maharshi - Page 137, 138

ఆ. సా. :— ఉపదేశములను పాటించుటకు ప్రయత్నించు చున్నాను. కాని వర్ణ భేదము బాధాకరముగా నున్నది. అది పోవలసినదే.

మహర్షి :— అది ఎవరికి బాధను కలిగించు చున్నది?

ఆర్యసామాజికుడు :— సమాజములోని సభ్యులకు......

మహర్షి:—చెప్పుచున్నది నీవు. వర్ణభేదములులేని దేశములున్నవి. వానియందు కష్టములు లేవా? అక్కడ యుద్ధములు పరస్పర హత్యలతో సంఘర్షణములు మొదలగునవి వున్నవి. నీవు ఆ ఘోర పరిస్థితుల నేల చక్కబెట్టుట లేదు?

ఆర్యసామాజికుడు :— కష్టములు ఇక్కడ కూడ వున్నవి.

మహర్షి :— భేదములు ఎల్లప్పుడు వుండును. ఇక్కడ మనుష్యులు మాత్రమే కాదు. జంతువులు, చెట్లు కూడ వున్నవి. ఈ పరిస్థితిని మనము ఏమియు చేయలేము.

ఆర్యసామాజికుడు :— జంతువులు మొదలగువాని సంగతి ప్రస్తుతము మనకు అక్కర లేదు.

మహర్షి :— ఎందుకు అక్కరలేదు? అవి మాటాడ గలిగినచో నీతో సమానత్వమును తమకు హక్కుగా ప్రకటించుచు మానవుల కంటే తీవ్రముగా నీ హక్కును ప్రతిఘటించ గలవు.

ఆర్యసామాజికుడు : దానికి మనము ఏమియు చేయలేము. అది ఈశ్వరుని పని.

మహర్షి :— అది ఈశ్వరుని పనియైనచో తక్కినది నీ పనియా? అంతేనా?

ఆర్యసామాజికుడు :— నేను భేదములను కాదనుట లేదు. ఆధిక్యమును గూర్చి హక్కులు మాత్రము తప్పు.

మహర్షి:- శరీరమునందలి యవయవములలోనే భేదములున్నవి. పాదమును తాకినచో చేయి మలినమగును. ఒక్కొక్క యవయవము తన కార్యమును నిర్వర్తించుచున్నది; నీవు భేదముల నేల కాదందువు?

అ.సా.:- వర్ణభేదము అక్రమమని ప్రజలు చింతించుచున్నారు.

మహర్షి:- అట్టి భేదములు తోచని దశకు నీవు వ్యక్తిగతముగా చేరుకొని సుఖముగా నుండవచ్చును. ప్రపంచమును మార్చుటకు నీ వెట్లు ఆశింపగలవు. నీవు ప్రయత్నించి నను నెగ్గలేవు. కావ్యకంఠ గణపతిశాస్త్రి మంత్రములను ఉపదేశించి బ్రాహ్మణులుగా చేయుటకై హరిజనులకు అవకాశ మొసంగెను. కాని హరిజనులు దాని నందు కొనుటకు ముందునకు రాలేదు.

22 nd August 1938

507 An Arya Samajist from Bangalore with a companion visited Sri Maharshi. He asked:

D : I do not approve of the caste system. Mahathma's opinion is valuable as guidance. I want your blessings in my attempts.

M : Mahathma has told you to seek and find yourself. You will not do it but require his blessings.

D : I am trying to follow the instructions. But caste distinction is painful, It must go.

M : To whom it is painful ?

D : The members of the society.........................

M : It is you who say it. There are countries where there are no such distinctions of caste, Are they free from trouble? There are wars, internecine struggles etc. Why do you not remedy the evils there ?

D : There are troubles here also.

M : Differences are always there. There are not only human beings, but also animals, plants etc. The state of affairs cannot be helped.

D : We do not mind the animals etc, at present.

M : Why not? If they could speak they would claim equality with you and dispute your claims no less vigorously than human beings.

D : But we cannot help it. It is God's work.

M : If that is God's work then the other part is your work, is that so?

D : I do not object to differences. But the claims of superiority are wrong.

M : There are differences in the limbs of one's body. When the hand touches the foot the hand is defiled. Each limb performs it's function. Why do you object to differences?

D : The people feel the injustice of caste distinction. it must be rooted out.

M : You can individually arrive at the state where such distinctions are not perceived and be happy. How can you hope to reform the world? Even if you try you cannot succeed. Kavyakantha Ganapathi Sastri offered to initiate Harijans with Mantras and make Brahmins of them. But the Harijans did not come forward to accept the offer ..........°

ఈ భేదముల సంగతి ఎట్లున్నను ఒక విషయము మాత్రము నిశ్చితము. ఈ అభిప్రాయ భేదములవలన నాయనకు గురువునందు భక్తి, మహర్షికి శిష్యునందు అనురాగము ఏ మాత్రము తగ్గలేదు. అభిప్రాయ భేదముల వలన మహితాత్ములయందు పరస్పరానురాగము భంగపడదు. నాయన నిర్యాణవార్త భగవానుని ఎంతగా కదిలించెనో చూడుడు.

---

° 'Talks with Maharshi' Pages 489, 490, 491

"నాయన పోయినాడని వార్త చేరగానే భగవాన్ 'పోయినాడా' అని గద్గద స్వరముతో కన్నీటితో 'అటువంటి వాడు మన కెక్కడ నుండి వస్తాడు' అనిరి.

ఖర్గపూరు శిష్యులు నాయనకు పాడెమీద నుండగా Photo తీసి Enlarge చేయించి తెచ్చి భగవానునకు చూపుచుండగా నేనును హాలు నందుంటిని.

వణకుచున్న కంఠముతో కన్నీటితో భగవాను వాక్కు: 'నాయన చనిపోయినారని ఎవరన్నారు. గాఢసమాధిలో నున్నట్లు వున్నారుగదా' అని మొగము నితరులకు చూపక ఉత్తరపు గోడవైపు త్రిప్పిరి.*

"జయంతి తే సుకృతినో రససిద్ధాః"

# 12. శ్రీఅరవింద దర్శనము

నాయన చెన్నపురము నుండి అరుణాచలమునకు మరలి వచ్చిన తరువాత, మహర్షి సంస్కృతమున రచించిన యుపదేశ సారమును చూచి దానియందలి గాంభీర్యమునకు, సౌలభ్యమునకు ఆశ్చర్యమును, ఆనందమును పొంది వెంటనే దానికి లఘువ్యాఖ్యను రచించి గురువునకు సమర్పించెను. అప్పటికి ఆశ్రమములోని పరిస్థితి నాయనకు సుఖకరముగా లేదు. గురువును దర్శించుచు సాయంకాలము లందు కొంతసేపు గడుపుచున్నను నాయన ఆశ్రమ వ్యవహారములలో గాని, భగవానుని ఎదుట జరుగు సల్లాపములలో

* జయంతి సంచిక – 'నాకు తెలిసిన నాయన' కృష్ణభిక్షు–పుట 10

గాని వెనుకటవలె పాల్గొనక త్వరగా మరలివచ్చి, చూతగుహ యందే కాలక్షేపము చేయజొచ్చెను. కొందఱి వలన రమణాశ్రమము వ్యాజ్యములపాలై అక్కడి వాతావరణము కలుషితమై యుండుటచే వాసిష్ఠుడు అక్కడి వారితో మాటాడుటకూడ మానుకొనెను. ఆయనకు ఆ యూరు విడిచి కొంతకాలము ఎక్కడికైనను పోవలయునను తలంపు గాఢమగు చుండెను. ఆ సమయమున నాయనను శ్రీఅరవిందుడు చూడగోరుచున్నాడని సుధన్వుడు లేఖ వ్రాసెను. దానిని నాయన రమణునకు రహస్యముగా చూపెను. "సరే వెళ్లి రండి" అని రమణుడు అనుజ్ఞనిచ్చెను. అది నెపముగా నాయన 1928 ఆగస్టు రెండవ వారములో తిరువణ్ణామలై వీడుటకు సిద్ధపడు చుండగా సుధన్వుడు వచ్చి ఆయనను పుదుచ్చేరికి తీసికొని పోయెను.

1928 లో ఆగస్టునకు ముందు సుధన్వుడు ఉమా సహస్ర మును శ్రీఅరవిందునకు పంపెను. దానిని సాంతముగా చదివి అతడు కావ్యకంఠుని చూడవలయునని శ్రీమాత వలన సుధన్వునకు తెలియజేసెను. అందువలన సుధన్వుడు అంత శ్రద్ధ వహించెను. శ్రీఅరవిందుడు ప్రకటించుచున్న "ఆర్య" పత్రికను చదివినప్పటి నుండియు వాసిష్ఠుడు చాల యేండ్ల క్రిందటనే శ్రీఅరవిందుని తన పూర్వజన్మ తపస్సఖులలో నొకనినిగా గుర్తించి శిష్యులతో చెప్పు చుండెను. అతనిని దర్శింపవలయును అను కుతూహలము కూడా నాయనకు ఉండెను. ఈ సందర్భమున గుంటూరు లక్ష్మీకాంతము వ్రాసిన విషయము గమనింపదగియున్నది. "తనకంటె వయస్సున పెద్దవాడు, తపశ్శాలి, పూర్వజన్మ తపస్సఖుడైన శ్రీఅరవిందుని

సందర్శించుటకు గాని, యతనికి నమస్కరించి యతని యాశీస్సు బడయుటకు కాని నాయన మనస్సు శంకించలేదు."*

ఇక్కడ ఒక విషయమును మనము పరిశీలింపవలసి యున్నది. నాయన పై యభిప్రాయములను శిష్యులతో ఇతరులతో అప్పుడప్పుడు వ్యక్తీకరించి యుండును. లేకున్నచో శ్రీ లక్ష్మీకాంతము పై విధముగా వ్రాయుటకు అవకాశము లేదు. ఇట్టి యభిప్రాయములను గూర్చి మహర్షి ఏమియు అనుకొనక పోయినను, ఆయన యొక్క భక్తులు అనుకొనుట అసహజము కాదు. మహర్షి మహాత్ముడు. మహాత్ముని భక్తులందఱు మహాత్ములై యుండరు. 'భగవానుడా! మాకు ఎవరును శరణము లేరు. మీరే మాకు శరణము. మమ్ము రక్షింపుడు. ఉద్ధరింపుడు' అని రమణుని ఆశ్రయించి యున్న భక్తులకు ఆయనకంటె అధికుడుగా గాని, సమానుడుగాగాని అప్పుడే ఒక డున్నాడు అని తలంచుట ఇష్టమై యుండదు. అట్లు తలంచుట అపరాధముగా కూడ అనేకులు తలంప వచ్చును. ఇది సంకుచిత భావము కావచ్చును. కాని అందఱు విశాల భావములు కలిగి యుండుట సంభవము కాదు. సూరి నాగమ్మ వ్రాసిన ఈ క్రింది విషయమునుబట్టి రమణునకు శ్రీఅరవిందునకుగల యంతరమును గూర్చి రమణ భక్తులు ఎట్లు గ్రహించు చుండిరో మనము గ్రహింప వచ్చును. 'ఈ మధ్య ఒకరు తమ స్నేహితులు సూక్ష్మ శక్తి పరిణామములు చూడగలవా రున్నారనీ, వారు మహాపురుషుల సూక్ష్మ శక్తి పరిణామాలు చూచారనీ, అందులో శ్రీఅరవిందుల సూక్ష్మ శక్తి కాంతి ఏడు ఫర్లాంగుల దూరం వ్యాపించిందనీ, భగవాన్

---

*నాయన – పుట – 591

సూక్ష్మశక్తి యొక్క కాంతి మూడు మైళ్ళవరకు చూడగలిగితినే కాని ఆ వెనుక ఎంతవరకు వ్యాపించినదో చూడలేక పోతిననీ, బుద్ధుడు మొదలయిన వారిదెవ్వరిదీ ఇంత దూరం వ్యాపించ లేదనీ చెప్పినట్లుగా భగవత్సన్నిధిలో నివేదించారు.'* ఇట్టి యభిప్రాయములు రమణ భక్తులలో ప్రబలముగా నున్నప్పుడు వారు వాసిష్ఠుని యెడ ఆయన శిష్యుల విషయమున అసంతుష్టులై యుండుట సహజము.

ఆగస్టు 15 శ్రీఅరవిందుని జయంతి. నాయన అక్కడికి చేరునప్పటికి భక్తులు, ఆశ్రమ వాసులు శ్రీఅరవిందుని దర్శించుట ముగిసెను. నాయన రాక ముందుగానే తెలియుటచే శ్రీమాత శ్రీఅరవిందులు ఒక గదిలో కూర్చుండి యుండిరి. రెండు నిముసములు నాయన శ్రీఅరవిందుడు పరస్పరము చూచుకొనిరి. నాయన గజాననాంశ సంభవుడని శ్రీఅరవిందుడు, శ్రీఅరవిందుడు అద్భుత శక్తి తేజము కలవాడని నాయనయు అనుకొనిరి. పిమ్మట శ్రీమాత నాయనతో కూడ ధ్యానము చేయగోరెను. అట్లు వారు ముప్పావు గంట ధ్యానించిరి. 'నాయన నిశ్చయముగ గొప్ప యోగి' అని శ్రీమాత కపాలి శాస్త్రితో చెప్పెను. నాయన పుదుచ్చేరిలో ఒక వారముండెను. అప్పుడు ఆయన "జనని" అను గ్రంథమునకు పీఠికను, 108 సూత్రములతో "తత్త్వాను శాసన" మును రచించెను. రెండును శ్రీఅరవిందుని మెప్పును పొందెను.

నాయన తిరువణ్ణామలైకి తిరిగి వచ్చి డిసెంబరులో ఇంద్ర స్తోత్రమును రచించెను. ఈ సమయమున పొన్నుస్వామి అయ్యరు

* శ్రీ రమణాశ్రమ లేఖలు 53 స్వప్నాలు భ్రాంతులు పుట 95.

అను శిష్యుడు వాసిష్ఠుని యొద్దకు వచ్చి తన్ను శ్రీమాత అనుగ్రహించి శ్రీఅరవిందాశ్రమమున చేర్చుకొనునట్లుగా లేఖ వ్రాసి ఇమ్మని ప్రార్థించెను. వాసిష్ఠుడు ఆమెకు ఇట్లు వ్రాసెను.
"భగవతి! శ్రీమాతా!

దురదృష్ట వశమున నేను దూరమున నున్నను, నా మనస్సుచే నీ పాదములను స్పృశించుచునే యుంటిని. నా జీవిత యాత్రలో ధన్యతమమైన దివసమందు నీ తేజస్సెట్టిది చూడబడెనో అది మోహమును ఖండించు అంతఃప్రభ నా కిచ్చుగాక! నీ పుత్రుడు దూరముగా నుండెనని యుపేక్షింప వలదు. బహు సంవత్సరముల నుండి నీ చరణములను ధరించిన నే నెచ్చట నున్నను నీ సాన్నిధ్యమందున్నట్లెంచి యనుగ్రహించ వలెను.

మఱియొక మనవి. శ్రీఅరవిందుని యందు భక్తి గలవాడును, శ్రీమాత యందు దృఢ విశ్వాసము గలవాడును, నాకు శిష్యుడును అయిన పొన్నుస్వామి అయ్యరు అభ్యనుజ్ఞను బొందుటకే ఈ పత్రము నీ జనుడు వ్రాసికొనెను. వానికి అభ్యనుజ్ఞ నిచ్చుటకు నీవు తగుదువు. వాడు ధన్యుడగు గాక.*

ఇట్లు,
నీ నిత్య భక్తుడు, హృదయ పుత్రుడు
వాసిష్ఠ గణపతి.

---

* నాయన–పుటలు 602, 603, వాసిష్ఠ వైభవము – ఉత్తర భాగము ప్రకరణము – 4

శ్రీమాత యందు నాయన ప్రకటించిన వినయ విధేయతలు భక్తి భావము రమణ భక్తులకు తెలియకుండ నుండవు. వారు దీని వలన ఆయన యందు అనాదరమును పొంది యుండుటయు సంభవించి యుండును.

ఈ సందర్భమున శ్రీఅరవిందుని సిద్ధాంతములను గూర్చి భగవానుని భావము లెట్లుండెనో గ్రహించుట యుక్తము.

13-3-1936 తేది బొంబాయి నుండి వచ్చిన ఒక పెద్దాయన మహర్షితో ఇట్లనెను. "శ్రీఅరవిందాశ్రమమున నేను మాతను ఈ ప్రశ్న అడిగితిని. 'భగవంతుడు తన నిజస్వరూపమున గోచరింపవలె నని నేను తలంపులు లేకుండ మనస్సును శూన్యమొనర్చు చున్నాను. కాని నా కేమియు కన్పించుట లేదు.' ఆమె యిచ్చిన సమాధానమున విషయము ఇట్లు వున్నది. 'పద్ధతి సరిగానే యున్నది. పైనుండి శక్తి క్రిందికి వచ్చును. అది ప్రత్యక్షమగు అనుభూతి.' కాబట్టి ఇంకపైన నేను ఏమి చేయవలె?"

మహర్షి: నీవు ఏదిగా నున్నావో అట్లే యుండుము. పైనుండి క్రిందికి వచ్చునది కాని, అభివ్యక్త మగునదికాని ఏదియును లేదు. అహంకారమును తొలగించుకొనుటయే కావలసినది. ఏది యున్నదో అది ఎప్పుడును వున్నది. ఇప్పుడు కూడ నీవు అదిగానే యున్నావు. దానికంటె భిన్నముగా లేవు. ఆ శూన్యము నీచే చూడబడు చున్నది. దానిని చూచుచు నీవు వున్నావు. నీవు దేనికొఱకు వేచియుండ వలె? 'నేను చూడ లేదు' అను తలంపు, చూడవలయునను

నిరీక్షణ, దేనినో పొందవలయునను కోరిక – ఇవి యన్నియు అహంకారము యొక్క కార్యములు. నీవు అహంకారముయొక్క వలలో పడినావు. ఆ యహంకారమే వీని నన్నింటిని చెప్పుచున్నది. నీవు కాదు. నీవు నీవుగా నుండుము. అంతకుపైన ఏమియు లేదు.''

13th March 1936 -

183 ; A gentleman from Bombay said: I asked Mother in Sri Aurobindo Ashram the following question. 'I keep my mind blank without thoughts arising so that God might show himself in His true being. But I do not perceive any thing.'

The reply was to this effect: "The attitude is right. The power will come down from above. It is a direct experience."

So he asked what further he should do.

Maharshi: Be what you are. There is nothing to come down or become manifest. All that Is needfull is to lose the ego. That which is always there. Even now you are that. You are not apart from it. The blank is seen by you. You are there to see the blank. What do you wait for? The thought 'I have not seen', the expectation to see and the desire of getting some thing are all the workings of the ego. You have fallen into the snares of the ego. The ego says all these things and not you. Be your self and nothing more.†

† Talks with Maharshi Pages 151, 152

14-6-1936 తేది పార్సీ స్త్రీలు కొందఱు శ్రీఅరవిందుని యోగమును గూర్చి, వేద ఋషుల యనుభూతుల కంటె అధికమైన దానిని అన్వేషించితినని ఆయన చెప్పుటను గూర్చి, మఱియును ఉపనిషత్తులలోని ఋషులకు కలిగిన సాక్షాత్కారమును పొంది యుండుట తనకు శిష్యులుగా కాగోరిన వారికి అర్హతయని శ్రీమాత అభిప్రాయపడుటను గూర్చి ప్రస్తావించి వీనిపై మహర్షి యభిప్రాయ మేమని యడిగిరి.

"శ్రీఅరవిందుడు సమగ్రమైన శరణాగతి చేయుడని ఉపదేశించు చున్నాడు. మొదట ఆ పనిని చేసి ఫలమును నిరీక్షింతము. తరువాత అవశ్యకమైనచో ఇతర విషయములనుగూర్చి చర్చింతము. ఇప్పుడు కాదు " అని మహర్షి శరణాగతిని గూర్చి చెప్పెను.

వారు మరల ఇట్లు ప్రశ్నించిరి, " దివ్య చైతన్యమును క్రిందికి తెచ్చుటను గూర్చి ఏమందురు? "

మహర్షి :- అది ఇప్పుడు మన హృదయమునందు లేనట్లా? " ఓ అర్జునా; నేను హృదయాకాశము నందు వున్నాను " అని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. " సూర్యుని యందు ఎవడు వున్నాడో ఆ పురుషుడు ఈ మానవుని యందు కూడ వున్నాడు " అని ఉపనిషత్తులోని మంత్రము చెప్పుచున్నది. " భగవంతుని రాజ్యము లోపల నున్నది " అని బైబిలు చెప్పుచున్నది. ఈ విధముగా భగవంతుడు లోపలనే యున్నాడను విషయమును అందఱును అంగీకరించు చున్నారు. క్రిందికి తేవలసినది ఏది? ఎక్కడ నుండి? ఎవడు దేని కొఱకు తేవలె?

శాశ్వతము, సర్వగతమును అయిన వస్తువును గుర్తించుటకు అవరోధములుగా వున్నవానిని తొలగించుటయే సాక్షాత్కారము. వస్తువు వున్నది. దానిని ఒకచోటి నుండి మఱియొక చోటికి తీసికొని పోవలసిన పని లేదు."

14th June 1936

200 Some Parsi Ladies asked for Maharshi's opinion of Sri Aurobindo's yoga and his claim to have probed beyond the experience of Vedic Rishis and the Mother's opinion of the fitness of her disciples to begin with the realisation of the Upanishadic Rishis.

Maharshi: Aurobindo advises complete surrender. Let us do that first and await results and discuss further if need be afterwards and not now.

Devotees: What about bringing down Divine Consciouness from above.

Maharshi: As if the same is not in the Heart? "O! Arjuna, I am in the expanse of the Heart." says Sri Krishna. "He who is in the sun, is also in the Man" says a mantra in the Upanishads. "The kingdom of God is within" says the Bible, All are thus agreed that God is within. What is to be brought down? From where? Who is to bring what and why?

Realisation is only the removal of obstacles to the recognition of tha eternal, immanent reality. Reality is. It need not be taken from place to place.†

† Talks with Maharshi Page 168.

బి. వి. నరసింహస్వామి అను న్యాయవాది చెన్నపురము నుండి నాయన చరిత్రను అడిగి వ్రాసికొనుటకు వచ్చి ముందుగా మహర్షిని దర్శించి స్వీయ చరిత్రమును చెప్పుడని కోరెను. "నాయన చెప్పిన తరువాత నేను చెప్పెదను" అని మహర్షి యనెను. ఆయన నాయన యొక్క చరిత్రమును అంశముల రూపమున నాయన చెప్పుచుండగా వ్రాసికొనెను. అట్లే మహర్షి చరిత్రమును వ్రాసికొని ఆయన వెంటనే దానిని గ్రంథముగా పెంపొందించెను. నాయన చరిత్రమును అట్లు పెంపొందింపక అంశముల ప్రతిని గైకొని ఆయన ఆశ్రమము నుండి బయలుదేరు చుండగా భగవాను ఆయన యొద్ద నుండి దానిని గైకొని భద్ర పరచెను. మహర్షి చరిత్రము "Self Realisation" (ఆత్మ సాక్షా త్కారము) అను పేరుతో ఆంగ్లమున ఆశ్రమము వారిచే ప్రకటింప బడినను, నాయన చరిత్రము విపులీకరింపబడ లేదు. భగవాను భద్రపరచిన యంశముల ప్రతి అట్లే యుండెను. నాయన స్వర్గస్థు డైన తరువాత కపాలిశాస్త్రి నాయన చరిత్రమును సంస్కృతమున వాసిష్ఠ వైభవమ్ అను పేరుతో రచించుచు అందులో మొదటి భాగమున ఆ యంశములను ఉపయోగించుకొనెను.

## 13. ఆనందాశ్రమ నివాసము

1929 వేసవిలో తిరువణ్ణామలైయందు ఎండలు నాయనకు దుర్భరముగా నుండెను. అప్పుడు అక్కడికి వచ్చిన దైవరాతుని శిష్యులు వాసిష్ఠుని గోకర్ణమునకు రమ్మని ఆహ్వానించిరి. మహర్షి

" అట్లే చేయు " డనెను. నాయన వారివెంట గోకర్ణమునకు పోయెను. అక్కడ కూడ ఎండ నాయనకు దుర్భరముగానే యుండెను. దైవరాతుని తమ్ముడు సీతారాముడు అక్కడనుండి ఆయనను "కుళువే" గ్రామమునకు చేర్చెను. అది శిరసికి దగ్గర. అది సముద్రతీరమునకు దూరమందున్నను 2000 అడుగుల యెత్తున నుండుటచే చాల చల్లగా నుండును.

వాసిష్ఠుడు కుళువేలో అహల్య అను నామెకు పీడను తొలగించి, తరువాత నామె భర్తకు టైఫాయిడ్ జ్వరము వచ్చినప్పుడు దానిని కూడ మాయమగునట్లు చేసెను. ఒకనాడు వాసిష్ఠుడు ఒక పాకలో శిష్యపరివృతుడై కూర్చుండి యుండగా సమీపములో గడ్డివాము లంటుకొని అగ్నిజ్వాల పాకను చుట్టుముట్టెను. వెంటనే వాసిష్ఠుడు పారాశరుని యగ్ని మంత్రమును అస్త్రముగా ప్రయోగించెను. పాకనుండి సుడిగాలి బయలుదేరి గడ్డివాములను జ్వాలలతో కూడ దూరముగా చిమ్మివేసెను. ఈ సంఘటనముల వలన అక్కడివారికి వాసిష్ఠుని మహిమలయందు గాఢమైన విశ్వాస మేర్పడెను.

మహాదేవుడు ఆస్తి విషయము తండ్రితో మాటాడుటకు కుళువేకు వచ్చెను. తండ్రికొడుకులు మోటారుబండిలో పయనించు చుండగా అది ఒక ప్రక్కకు పడెను. మహాదేవుని మోచేయి విఱిగెను. సమీపమందున్న వైద్యుడు తాత్కాలికముగా కట్టుకట్టి " పెద్దాసుపత్రికి తీసికొనిపొం" డనెను. మహాదేవుడు భయపడు చుండగా వాసిష్ఠుడు ఋగ్వేదములోని అస్థిసంధాన మంత్రమును పఠించి క్షణములో విఱిగిన చేతిని అతుకుకొనునట్లు చేసి

కుమారుని ఆనందమున, వైద్యుని ఆశ్చర్యమున ముంచెను. పిదప నాయన కుమారుని కలువఱాయికి చేర్చి కుళువేకు తిరిగి వచ్చుచు త్రోవలో రమణ భగవానుని దర్శనము గావించు కొనెను.

1929 మే నుండి 1931 ఫిబ్రవరి వరకు నాయన కుళువేలో నిశ్చల తపస్సులో గడిపెను. సుందర పండితుడు, అతని తండ్రి పుండరీక రాయుడు అను వారు నాయనకు ఆప్తులై ఆయనను శిరసిలో తమ యానందాశ్రమములో నుండుడని ఆహ్వానించిరి. వాసిష్ఠుడు యాశ్రమమునకు చేరి పెక్కుమందికి మంత్రదీక్షల నొసంగుచు మహర్షిని గూర్చి ప్రసంగించుచు నుండెను.

కపాల భేద సిద్ధితోపాటు వాసిష్ఠునకు అంతరంగమున ఒక దివ్య శరీరము పుట్టి ఆయనకు తెలియకుండగనే ఇతరులను ఆవహించుచున్నట్లు తోప జొచ్చెను. దానిని ఆయన స్వాధీన మొనర్చుకొనుటకు ప్రయత్నించుచుండెను. రామచంద్రభట్టు అను శిష్యుడు సంస్కృతమునే ఎఱుగని వాడు. నాయనయొక్క ప్రసంగములను శ్రద్ధతో వినుచు ఇతరుల పరిహాసములకు లోనగు చుండెను. అట్టివాడు అల్పకాలముననే సంస్కృతమున ప్రజ్ఞను పొంది అందఱకును ఆశ్చర్యమును కలిగించెను. ఇది ఆ దివ్య శరీరముయొక్క మహిమయేయని వాసిష్ఠుడు గుర్తించెను.

శిరసిలోని యానందాశ్రమము నుండి నాయన భగవానునకు చాల ఉత్తరములు వ్రాసెను. వానిలో నాయనయందు కలిగిన పరిణామము చక్కగా వ్యక్తమగుచున్నది. 17-3-1931 తేదీ నాయన ఇట్లు వ్రాసెను.

"భగవన్ విశ్వగురూ,

...సద్దర్శనము శనివారము 14-3-31 నాడు ముగింపబడెను ...... నా యనువాదమునందు గుణమున్నచో నది భగవానుని యనుగ్రహమే. ఆ శనివారమునుండి నా దృష్టి విలక్షణము కాజొచ్చెను. సర్వ పదార్థమును ఏక స్వరూపముగా జూచుచుంటిని. ఈ యభ్యాసము దృఢమై యనుభవ రూపమున నుండుటకు భగవంతుని ప్రార్థించుచుంటిని. నీటియందు బుడగవలెనే యొక్క సద్వస్తువునం దీరూప వికారములను తిలకించుచుంటిని. ఆ వికారమును విడిచి శుద్ధసద్రూపమును పొందుటకు యత్నించుచుంటిని.

ఇట్లు మీ యనుగ్రహార్థి,
వాసిష్ఠుడు.

భగవన్ కారణ గురో, 24-3-31,

.... ఓ మాయాపుంజ సంహారీ; ఇప్పటికిని నాకు భేదబుద్ధి యస్తమించలేదు. మీయొక్క క్షణిక సంకల్పమున్నచో నాకది సర్వాత్మ భావ మగునని నే నెఱుగుదును. స్వేచ్ఛగా మీ మనస్సునందొక్క సంకల్పమైన నుండజాలదని నే నెఱుగుదును. ఈశ్వరుడే మీ మనస్సునం దట్టి సంకల్పమును బుట్టింప సమర్థుడు. ఇట్టి ద్రావిడ ప్రాణాయామ విధమేల యని ప్రశ్న రావచ్చును. ఈశ్వరుడే స్వయముగా అనుగ్రహించక మఱొకనికి సంకల్పము బుట్టించుటకేల ప్రయాస పడవలెను? నిజమే. ఈ రహస్యము పుణ్యాత్ము లెఱుగదగినది. అవతార పురుషుడు జాగరూకుడై

యుండగా నతని ద్వారా ఈశ్వరుడు తన కర్తవ్యమును చేయును గాని స్వయముగా చేయడని సిద్ధాంతము. అందువల్లనే తమ మనస్సు నందట్టి సంకల్పము బుట్టించుట కీశ్వరుని నేను ప్రార్థించుచుంటిని.

ఇట్లు.
మీ జన్మాంతర సోదరుడు.

భగవన్, దహరశయా,

......నాథా! తపస్సు పరిపక్వమై, అహంకారము నశించి, సహజ స్థితియందు స్థిరమై, యింద్రియ సమూహమంతయు భగవదాయత్తమై యుండగా సర్వము సాధింపబడినట్లు నేను తలంచుచుంటిని. నిజాత్మనిష్ఠ నాకు మూలనిష్ఠకు మార్గము జూపుగాక. తమ కరుణ సన్నిధియందే సర్వాభీష్టసిద్ధి పూర్ణ మొందునని నే నెఱుగుదును. అట్టి శుభ కాలమునకై ప్రతీక్షించుచుంటిని. ఈ జను డిప్పుడు దూరములో నున్నను తమ చిత్త సామీప్యమందున్న వానివలె ప్రకాశించుగాక. ప్రభో! మీ రెప్పుడు నా హృదయమందే శయనించుచున్నారు. నే నెప్పుడు మీ పాదముల యొద్దనే శయనించుచుంటిని. మీరు నాకు నియోగించు ప్రభువులు, నేను మీకు కార్యదాసుడను.

ఇట్లన్నివిధముల మీ వాడైన
వాసిష్ఠుడు.

5-5-1931

భగవన్, మాయామానుషా,

....... ప్రభో! నా స్థితిని కొంచెము తమ చరణసన్నిధిని నివేదించుకొనుటకు నే నుత్సాహపడుచుంటిని. గొప్ప ఆనందమును పరమ లక్ష్యముగా కొందఱెంచుదురు. నిరతిశయ యోగసిద్ధి ముఖ్య లక్ష్యమని మఱికొందరు తలంతురు. సుఖ దుఃఖాతీత స్థితి యింకను కొందఱికి లక్ష్యమగుచున్నది. కొందఱు మృత్యు విజయము గొప్పదందురు. నేను మాత్రము కామోపశాంతి కమనీయ లక్ష్యమని తెలియుచుంటిని. నిస్సారములైన కొన్ని కామము లుపశాంతి నొందెను. కొన్ని యనుభవింపబడి శాంతి బొందెను. దూరము జేయబడి మఱికొన్ని యుపశాంతి గావింప బడెను. సారమున్నదో లేదో కాని నాకొక్క కామ్యము మాత్రముండి పోయెను, దానిని నిషేధించుటకు శక్తిలేదు దూరముగా పొమ్మను టకు ఇచ్ఛలేదు. నా కష్టములో భగవంతుని సహాయమును యాచించు చుంటిని. ఆ నా కోర్కె భగవంతునకు తెలిసియే యుండును.

ఇట్లు

"..............."

22-7-1931

భగవన్, భక్తవత్సలా,

మంత్రజప మహిమ వీక్షింపబడెను. యోగసారము విలోకించ బడెను. కుండలినీశక్త్యుల్లాసము పరీక్షింపబడెను. "అహం" యొక్క జన్మస్థలము నిరీక్షించబడెను. మౌనముచే ప్రకృతి పాక మన్వీ క్షింపబడెను. భేదభావము దూరీకృతము గావింపబడెను. చప

లత్వము నిరస్తము చేయబడెను. స్థయిర్యము అభ్యసింపబడెను. అట్లయినను నేను తృప్తి జెందలేదు. ఇప్పుడింక భక్తిచేతనే తృప్తి బొందగోరు చుంటిని. ఆ భక్తికి మూడు స్థానములున్నవి. ప్రథమ స్థానము భగవాన్ మహర్షి, ద్వితీయ స్థానము భగవానింద్రుడు. తృతీయ స్థానము భగవతి మాతా భారతభూమి.*

ఇట్లు మీ చిరకాల భక్తుడైన
గణపతి.

ఈ లేఖలవలన ఆత్మనిష్ఠను నిలుపుకొనుటకై నాయన మనస్సునందు ఎంత సంఘర్షణము నొందుచుండెనో స్పష్టమగు చున్నది. మార్చి 17 వ్రాసిన లేఖలో "శుద్ధసద్రూపమును పొందుటకు యత్నించుచుంటిని" అని తన లక్ష్యమును ఆయన స్పష్ట మొనర్చెను. ఈ లక్ష్యము తనకు సిద్ధించుటకు అవతార పురుషుడైన రమణుడు సంకల్పము చేయువలయునని 24 వ తేది లేఖలో ప్రార్థించెను. "నే నెప్పుడు మీ పాదముల యొద్దనే శయనించుచుంటిని. మీరు నాకు నియోగించు ప్రభువులు. నేను మీకు కార్యదాసుడను" అని 14–4–31 తేది లేఖలో నాయన వ్రాసిన వాక్యములు ఆయన యందున్న గురుభక్తిని వ్యక్తీకరించు చున్నవి. గురువును సేవించునప్పుడు అహంకారమును పూర్తిగా వీడి దాస్యమొనరించుటకు కూడ సిద్ధపడవలయునని ఎల్లరు

---

*నాయన–పుటలు 636 నుండి 645 వఱకు వాసిష్ఠ వైభవమ్ ఉత్తరభాగము–ప్రకరణము–7

గ్రహింప వలసి యున్నది. అయనయందు సకల కామములు ఉపశాంతి పొందినను ఒక్క కామ్యము మాత్రము ప్రబలముగా మిగిలియుండెనని "దానిని నిషేధించుటకు శక్తిలేదు, దూరముగా పొమ్మనుటకు ఇచ్ఛ లేదు" అని ఆయన మే 5వ తేది లేఖలో తన నిస్పృహాయస్థితిని, నిర్వేదమును స్పష్టమొనరించెను. ఇంద్రుని ఉపాసించి శక్తిని పొంది భారత భూమియొక్క దుర్గతిని ఎట్లయినను తొలగింపవలయు నను కాంక్షయే ఆ ప్రబలమైన కామ్యమని 22-7-31 తేది వ్రాసిన లేఖలో స్పష్టమగుచున్నది. కుండలినీ శక్తియొక్క ఉల్లాసమును పరీక్షించినను " అహం " యొక్క జన్మస్థలమును పరీక్షించుచు ఎంత తీవ్రముగ తపస్సు చేసినను నాయన ఆ కామ్యమును తొలగించుకొనలేక తృప్తిని పొందలేక భక్తినే ఆశ్రయింపవలసి వచ్చెను. ఆ భక్తికికూడ గురువు, ఇంద్రుడు, భారతభూమి లక్ష్యములగుట గమనింపదగియున్నది. దీనినిబట్టి సంకల్పరహితమైన ఆత్మనిష్ఠను సాధించుట చాలా దుర్ఘటమని, సర్వసంకల్ప పరిత్యాగమే సంతృప్తిని సంతుష్టిని, ఆనందమును కలిగింపగలదని గ్రహింపవలసియున్నది. యీ అభిప్రాయమును అయనయే 10-3-31 తేది వ్రాసిన లేఖలో ఇట్లు స్పష్టమొనరించినాడు. "ప్రభో! భగవంతుని కటాక్షమువలన నాకు ఏ నిష్ఠ ప్రాప్తించెనో, అది నాకిక్కడ విజ్ఞానాత్మక మగుచున్నది. శరీరముకంటె భిన్నముగా ఆత్మను ఈ గుహయందు అనుభవించుచుంటిని. అట్లయినను ప్రపంచానుభవమునుండి యిది భిన్నత్వము బొందనందున పూర్ణనిష్ఠ గాదని తలంచుచుంటిని. అట్టి పూర్ణ నిష్ఠకై బహుయోజనములు లంఘించగల్గు తమ కటాక్షమును బంప వేడుచుంటిని."

14-3-1931 తేది నాయన "ఉన్నది నలువది" అను గ్రంథమును సద్దర్శనముగా సంస్కృతము లోనికి అనువదించి, జూన్ నెల చివరకు "ప్రచండ చండీత్రిశతి" అను స్తోత్ర గ్రంథమును ఈశోపనిషత్తునకు లఘుభాష్యమును రచించెను.

శ్రీ ఆర్యసోమయాజుల అప్పన్నశాస్త్రి సద్దర్శనములోని రచన యొక్క ప్రాశస్త్యమును ఇట్లు నిరూపించెను. "వీరి యనునాదములో పాదపూరణము కొఱకు ఒక్క వ్యర్థాక్షరమైనను మచ్చునకైనను కానరాదు. జటిల సమాసములు లేనే లేవు. పదములు అర్థమును బోధించుటలో ప్రసాద గుణభరితములై యున్నవి. ఒక్క పదమును కూడ మార్చుట కవకాశము లేదు. చిక్కనైన శైలితోను మృదు మధురములగు పదములతోను భావ గాంభీర్యముతోను, ప్రకాశించు ఈ గ్రంథము శ్రుతి సమ్మతమైన అద్వైతామృతమును మనకు అందించు చున్నది." *

1933 లో నాయన ఋగ్వేదమును మథించి భారతేతిహాసము నందు వర్ణింపబడిన చరిత్రను విమర్శించుచు 'భారత చరిత్ర పరీక్ష' అను పెద్ద గ్రంథమును రచించెను. ఆ గ్రంథములోని ప్రధానాంశ ములను కొన్నింటిని శ్రీ గుంటూరు లక్ష్మికాంతము ఇట్లు సంగ్ర హించెను. "భారత కథకు చెందిన మహావీరు లందఱు శ్రీకృష్ణునితో సహా ఋగ్వేద మందు మంత్రద్రష్టలుగా నుండుట, వారు తపస్సం పన్నులైనను దేశము కొఱకు యుద్ధము సల్పి ధర్మమును కాపాడుట

* జయంతి సంచిక – సద్దర్శన సమీక్ష పుట 38

మొదలగు విషయములను బట్టి ఋగ్వేద ఋషుల వీర గాధలే మనకు ప్రసిద్ధ పురాణములైన ట్లీ విమర్శ నుండి విదిత మగును. అంతేగాక వేద కాలపు ఋషులు తమ తపశ్శక్తి నీనాటి వేదాంతుల వలె యాధ్యాత్మ సౌభాగ్యమునకే కేవలము వినియోగించుకొని, దేశ సౌభాగ్యము నశ్రద్ధ చేయలేదనియు, స్వాతంత్ర్యమునకు భంగము కలిగినప్పు డాంతర్య మందెట్లో బాహ్యమందట్లే చికిత్స చేయుట కహింసాది ధర్మముల నడ్డు రానీయ లేదనియు విశద మగును. మఱియు, కురు వంశమునకు జెందిన కౌరవులు పాండవుల వలె భారతీయులు కారని ధ్వనించు చుండును." *

నాయన గావించిన పరిశోధనలకు కలుగవలసిన ప్రచారావశ్యకతను గూర్చి గుంటూరు శ్రీ లక్ష్మీకాంతము ఇట్లు ఉద్ఘాటించెను. "ఈ గ్రంథము వలన మహాభారత పురాణము సంస్కరింపబడుటయే గాక, ఇతర పురాణేతిహాసము లందు నీచపఱుప బడిన ఋషి చరిత్రము లన్నియు సంస్కరింపబడిన వయ్యెను. అట్లే ఋషి సంప్రదాయము లనెడి పేరుతో మనుచున్న కొన్ని న్యాయము లన్యాయములని తేటపఱుపబడి నందున మన వైదికాచారములను శాసించు శాస్త్రములు సంస్కరింపబడిన వయ్యెను. మఱియు నిట్టి వేదార్థ మథనముచే విజ్ఞానకోశ మనదగు ఋగ్వేదము నుండి ఇతర రహస్యముల పరిశోధనకు పూనుకొన వలెనని పండితులకు ఆదర్శ మేర్పడును. కాని యిట్టి ఆదర్శములచే నాకర్షింపబడని ఈనాటి పండితులు గానుగెద్దులవంటివారే కాని స్వతంత్ర విచార శీలురు

* నాయన పుట 648

కారని నాయన కదివఱకే యనుభవ మయ్యెను. లోక హితముకొఱ కిట్టి పరిశోధనలచే పండితులు తోడ్పడవలెనని నాయన ఎన్నాళ్ళు చెప్పినను నొక్క పండితుడైన ముందునకు రాలేదు. ఆలోచింపగా పండితు లీనాడు పామరుల కంటే నధిక ధనలంపటులై, ధన రూపమున కిట్టుబడికాని కార్యము లెంత పుణ్యప్రదములైనను తీరుబడి లేనివారివలె వాటి నంటకుండిరి''...*

నాయన గావించిన ఋగ్వేద పరిశోధనా వైశిష్ట్యమును శ్రీ అప్పల సోమేశ్వర శర్మ ఇట్లు ప్రశంసించినాడు. "ఇక మూర్ధవ రచన" "ఋగ్వేద సంహిత" వాసిష్ఠుని ప్రాణ సంహిత. దానికి ఉపోద్ఘాత భాగ్యం ఈ కృతి (ఋగ్వేద భూమిక) వున్న గ్రంథాన్ని పరిశీలిస్తే శరీరం గగుర్పాటు చెందుతుంది. ఆ వాక్పాటవం, ఆ పాందిక, ఆ యుక్తి, ఆ గాంభీర్యం, ఆ పరమ స్వాతంత్ర్యం నాయనకే చెల్లుతాయి. "న భూతో న భవిష్యతి". ఇందులోని పరమ విశేషం "వేదాలు పౌరుషేయాలు" అని ప్రతిపాదించడం. అంటే "అతీంద్రియ ద్రష్టలైన మహర్షులు రచించిన గ్రంథాలు వేదాలు" అని నొక్కి వక్కాణించడం. ఈ సందర్భములో గణపతి శాస్త్రి. వేద వాక్య విశారదులైన శబర స్వామిని, సాయనాచార్యులను కూడా సూటిపోటి మాటలతో అధిక్షేపించి విడిచి పెట్టారు. ఈ గ్రంథము పూర్తి అయితే ఎంతటి సిద్ధాంత రత్నాలు దొరికి వుండేవో; భవతు"*

---

* నాయన పుట 650

* జయంతి సంచిక పుటలు 15, 16

1934 ఫిబ్రవరిలోనో, మార్చిలోనో నాయన శిరసి విడవలసి వచ్చెను. కలువరాయికి చేరి ఆయన ఆంధ్ర విశ్వవిద్యాలయ వార్షికోత్సవములకు విశాఖపట్టణమునకు పోయి భారత చరిత్ర పరీక్షను గూర్చి రెండు ఉపన్యాసములు గావించెను. ఆ యుపన్యాసములకు ముగ్ధులై విశ్వవిద్యాలయము నందు ప్రాచీన విద్యా పరిశోధనల శాఖలో నాయనను చేర్చుకోవలయునని చాలామంది యాచార్యులే (Professors) కాక వైస్ ఛాన్సలరుగా నున్న సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు కూడ తలంచెను. కాని వాసిష్ఠుడు తపో వృత్తిని విడుటకు ఇష్టపడ లేదు.

కలువరాయిలో మహాదేవుడు తండ్రి కొఱకు మామిడి తోటలో కుటీరమును సిద్ధ మొనరించెను. అందులో చేరుటకు 14-9-1934 తేది శుభ దినముగా నిశ్చయింపబడెను. కాని మహాదేవునకు రైల్వేలో ఉద్యోగమును చూపింతుమని ఆశ చూపి శ్రీ మరువాడ ప్రసాదరావు ఆ శుభ దినముననే నాయనను గైకొని ఖడ్గపురమునకు బయలు దేరెను.

మహాదేవుడు కూడ పడితుడు, కవి. 'వాసిష్ఠ' అను పేరుతో ఈయన తండ్రి గారి యసంపూర్ణమైన నవలను 'పూర్ణ' ను పూర్తి చేసినాడు. ఈయన 'వృషాకపి', 'భోజనస్థానము' మొదలగు గద్య రచనలను, 'తోవూరుయుద్ధము', 'అపర్ణ'మొదలైన నవలలను వ్రాసి నాడు. ఈయన పద్య రచనము నందుకూడ సిద్ధహస్తుడే. గణపతి స్తవము, ప్రహ్లాద చరిత్రము మొదలుగా పెక్కు కావ్యముల నీయన రచించినాడు. తంజావూరు సరస్వతీ మహలులో తెలుగు రీసెర్చి పండితుడుగా పనిచేయుచు విప్రనారాయణ చరిత్ర మొదలైన గ్రంథాలను సంపాదించి (Editing) ప్రకటించినాడు.

శ్రీ అయ్యల సోమయాజుల వేంకటరమణ ఈయననుగూర్చి చెప్పిన మాటలు గమనింపదగియున్నవి. "........లౌకిక జీవనంలో ఆయనపడ్డ కష్టములకు అంతులేదు. నిత్య గంభీరుడు, శాంత స్వరూపుడు, కోమల హృదయుడు అయిన ఆ మహనీయునికి సంసారము ప్రతిబంధకముగా నుండెడిది. చేతికి ఎముక లేని ఆయన త్యాగానికి రాబడి చాలెడిది కాదు. అతను సంసారానికి అంటి ఉండెడివాడు కాదు. సంసారం అతనిని అంటి ఉండెడిది. నిరంతరము ధ్యానమగ్నుడై తనలో తానే ఎక్కువగా జీవించాడాయన. అంటీ అంటని జీవితాన్ని గడిపి, గీతలో చెప్పినట్లు సుఖదుఃఖాలను, మానావమానాలను సమానంగా భావించి, భరించి 20–3–1966 తేది ఆదివారంనాడు అకస్మాత్తుగా గుండెనొప్పితో కన్నుమూశారు."*

ఇప్పుడు ఈయన కుమారుడు, నాయన మనుమడు "మైత్రావరుణ" అను పేరుతో తాతగారి "ఉమాసహస్రము" నకు వ్యాఖ్య వ్రాసి "రమణజ్యోతి" పత్రికలో ప్రకటించుచుండుట సంతోషకరము.

# 14. ఖడ్గపుర నివాసము

ఖడ్గపురములో నాయన నవంబరులో ఇండియన్ ఇన్స్టిట్యూటులో బహిరంగోపన్యాస మొసగెను. అప్పుడు నేమాని సూర్యనారాయణ శిష్యుడయ్యెను. ఇతడు నాయనను కలకత్తాకు ఆహ్వానించెను. కలకత్తాలో కిడ్డర్ పురమునందు ఆంధ్రులు

*జయంతి సంచిక – పుట 77

హెచ్చుగా నుండిరి. అక్కడ గుంటూరు లక్ష్మీకాంతము తెలుగు పాఠశాలను నడుపుచుండెను. 24-11-1934 తేది నాయన కలకత్తాకు వచ్చినప్పుడు సూర్యనారాయణ యింటిలో వసతిలేక అయనను లక్ష్మీకాంతముగారి యింటిలో ఉంచిరి. లక్ష్మీకాంతము నాయనను చూడగనే పదేండ్లక్రిందట తాను స్వప్నములో చూచిన సిద్ధపురుషునిగా గుర్తించి ఆశ్చర్యమును ఆనందమును పొందెను.

ఆనాడు సూర్యనారాయణతో వచ్చిన మిత్రులు అభిలషింపగా యింటియందే నాయన తన చరిత్రమును గంటసేపు చెప్పెను. ఆ రాత్రి శనివారపు భజనకు సుమారు నలువదిమంది చేరి భజనయైన తరువాత నాయనను ఉపన్యసింపుమనిరి. యజ్ఞావతారము తేజోంశావతారము అని అవతారములు రెండు విధములుగా నుండునని, రామకృష్ణాదులు యజ్ఞావతారములని, మానవుల నిష్కామకర్మ యజ్ఞరూపమై ఈ యవతారములకు ఉపాధి యగునని, జన్మాంతర పుణ్య బలము గలవారు తేజోంశావతారులని, వీరు ఆధ్యాత్మిక ప్రపంచమునకు గురువులు ఆదర్శప్రాయులును అగుదురని నాయన ఆ ప్రసంగమున వివరించెను. ఆదివారం పెద్ద సభలో నాయన వేదకాలమును గూర్చి, సోమవారము రమణ భగవానుని గూర్చి ప్రసంగించెను.

త్వరలోనే అనేకులు నాయనకు శిష్యులు రమణునకు భక్తులు ఏర్పడిరి. తరువాత పాఠశాలయందే ఆయన పదునైదు ఉపన్యాసముల నిచ్చెను. ప్రసంగములు ప్రశ్నలపై ఆధారపడి యుండెడివి. ఆ ప్రశ్నలను కూర్చుటలో ఆ పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడైన

బి. ఎస్. రామారావు, ఆయనకు మిత్రుడు ఆర్. సంజీవరావు అధిక ప్రజ్ఞను చూపి నాయనకు ప్రేమాస్పదులైరి. వీరే నాయన కీర్తిని కలకత్తాలో నాలుగు మూలలకు ప్రసరింప జేసిరి. సుమారు ఒక మాసము ఇట్లు గడచెను. ఈ ఉపన్యాసములవలన అక్కడ పెద్ద సంచలనము కలిగెను. నాయన మంత్రదీక్షలను గైకొనిన వారికి నియమావళిని ఏర్పఱచి ప్రత్యేక బోధనలను గావించెను. భక్తులు నాయన కొఱకు ఒక అద్దె యింటిని ఏర్పఱచిరి. లక్ష్మీకాంతము నాయనకు తగినట్లుగా ఆహారపానీయాదులను సమకూర్చుచుండెను. లక్ష్మీకాంతమునకు ఆయన భార్య సూరమ్మకు రాత్రులందు నాయన ప్రత్యేకముగా బోధించెడివాడు. 1935 ఆగస్టులో నాయన ఆమెకు గాయత్రీ మంత్రమును ఉపదేశించెను. నాయన దివ్య శరీరము ఒకనాడు లక్ష్మీకాంతమును ఆవహించెను. అప్పుడు నాయన ఇట్లనెను. "ఇది నా దివ్య శరీరముయొక్క యనుగ్రహ చేష్ట. ఇది సూరమ్మను అనుగ్రహించుటకు నన్ను ప్రేరేపించిన పిదప, నాకు తెలియకుండ నిన్ను అనుగ్రహించెను. దీని యుద్భవము నాకు కపాలము భిన్నమైనప్పుడే తెలిసినను ధ్యానమందున్నప్పుడు మాత్రము నాకు దాని మహిమ గోచరించుచు, మిగిలిన వేళలందు దాని వ్యాపార సంచారములు తెలియబడుట లేదు. అది తెలిసినప్పుడు నా తపస్సు పూర్ణ సిద్ధిని బొందినట్లగును. అందుకొఱకు నేనిరువది దినములు రేణుకాదేవి యాజ్ఞాపించిన దీక్ష బూనవలెను. కాని దీనికి పూర్వము గోచరించవలసిన సిద్ధి యభివ్యక్తము కానందున నా తపస్సునందు ఆ దీక్షకు దగిన పాకము రాలేదని జాప్య మొనర్చుచుంటిని."*

*నాయన – పుట 694

# 15. ఉపసంహారము

1935 అగస్టు మూడవ వారములో నాయన ఖడ్గపురమునకు పోయి అచాట్ల పార్వతీశముయొక్క యింటిలో బస చేసెను. ఈ సమయముననే ఒకనాడు నాయన కంచి కామకోటి పీఠాధిపతులైన చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారిని దర్శించుట సంభవించెను. గోపాలశాస్త్రి (గోపదేవ్) అను యోగివలన ఈ సన్నివేశము ఏర్పడెను. గోపాలశాస్త్రి నైష్ఠిక బ్రహ్మచారి. ఖడ్గపురమునకు స్వామివారు వచ్చినప్పుడు ఇతడు స్వామివారిని దర్శించుచుండెను. ఇతడు నాయనను గూర్చి అంతకు పూర్వమే వినియుండెను. కాని, చూచి యుండలేదు. పండితు లెందఱో స్వామివారి దర్శనమునకు వచ్చు చుండగా నాయన రాలేదేమని సందేహము కలిగి ఇతడు స్వామి వారినే అడిగెను. "వారు నిరపేక్షులు. అందువలన రాకయుందురు. అదియునుగాక వారు సంస్కరణ శీలురు. అందువలన రాక యుండవచ్చు"నని స్వామి, వారు వచ్చినచో తమకు అభ్యంతరము లేదనికూడ తెలిపిరి. గోపదేవుడు నాయనయొక్క నివాస స్థాన మును తెలిసికొనిపోయి ఆయనను దర్శించెను.

నాయనయొక్క రూపము గోపదేవుని మిగుల నాకర్షించెను. ఈ సందర్భమున గుంటూరు లక్ష్మికాంతము చిత్రించిన నాయన రూపమును గ్రహించుట సమంజసము. "ఐదున్నర అడుగుల యెత్తుగలిగి బక్క పలుచగా నున్నను, బంగారు బొమ్మవలెనున్న ఈ మానవాకృతి యెట్టివారి దృష్టినైన నరికట్టి యాకర్షించెడిది. విశాలమైన ఫాలము, బట్టతల, పూర్ణవికాసమును స్ఫురింపజేయు తీరుగల శిరస్సు, విజ్ఞాన దృక్కులను ప్రసరించు నేత్రములు,

గాంభీర్యము నిచ్చు కనుబొమలు, సన్నని మీసము, పలుచగా వ్రేలాడు చిన్న గడ్డము గల నాయన యాకృతి గతయుగమునకు చెందిన ఋష్యాకృతి నెట్టివారికైన స్మరణకు దెచ్చుచుండెడిది. పిల్లలకు, పెద్దలకు, వృద్ధులకు గూడ నాయనను జూచుసరికి పేరునకు తగినట్లు పితృభావము స్ఫురించి, బిడ్డలవలె శరణు బొందుటకు చిత్తము ప్రేరేపించుట యామూర్తి విశేషము. అందుల కనుగుణముగా నాయన చూపునందేగాక యావత్తు ముఖవికాసము నందు వెల్లువలైనట్లు వాత్సల్యానుకంపము లవ్యాజముగా నుట్టి పడుచుండెడివి. ఇక కంఠము విప్పినచో ఘంటానాదము ధ్వనించి, సత్యప్రకర్షతో గూడి అధికారయుతమైనను మధురరస పూరితము లగు మాటలు వెడలి హృదయ సమావర్జన మొనర్చుచుండెడివి. ఆ యోజస్సునందు గౌరవముతోపాటు చనువు బుట్టించు విశేష ముండెడిది. చిఱునవ్వు మాటిమాటికి వెల్లివిరిసి, కలకల ధ్వనులతో గిలిగింతలు పెట్టుచున్నట్లుండి సంతోషమును వ్యాప్తిజేయు చుండెడిది''....*

ఇట్టి మనోహరమైన యాకృతి గోపదేవు నాకర్షించుటలో ఆశ్చర్యము లేదు. నాయన గోపదేవుని మిగుల నాదరించి, అతని యభ్యర్థనము ననుసరించి అతనితో స్వామివారి యొద్దకు పోయెను. అక్కడ నాయన భక్తి శ్రద్ధలతో పీఠమునకు స్వామివారికి దండ ప్రణామము లాచరించి సంస్కృతములో వారిని స్తుతించెను. స్వామివారుకూడ నాయనను చక్కగా నాదరించిరి. వారికిరువురకు నాలుగు గడియలు (96 నిముసములు) సంస్కృతమున సంభాష

*నాయన పుట 728, 729

ణము సరసముగా సాగెను. స్వామివారు చాలా సంతోషించి తగి నట్లుగా సత్కరించిరి.*

1-9-35 తేది వినాయక చతుర్థియందు నాయననే విఘ్నేశ్వరునిగా పీఠము పైనుంచి భక్తులు కొందఱు షోడశోపచార పూజలను చేయవలయునని అభిలషించిరి. వారి యుత్సాహమును భంగపఱచుటకు ఇష్టములేక నాయన తనకు ఇష్టము కాకున్నను అందులకు అంగీకరించెను. మహోత్సవముగా భక్తులు నాయనను గణపతినిగా పూజించిరి. అలవాటు చొప్పున పురోహితుడు ఉద్వాసన మంత్రములను కూడ పఠించెను. నాయనకు నవ్వువచ్చెను. కాని అది అపశకునమే అయ్యెను.

తరువాత కొన్ని దినములకు నాయన మనుమని బాలసారె కొఱకు కలువఱాయికి పోయెను. అప్పుడు ఆయన చేతియందు యాదృచ్ఛికముగా చేరిన రాగి నాణెము స్వర్ణముగా మాఱెను. అప్పటికి రేణుకాదేవి ఆజ్ఞాపించిన దీక్షను పొందుటకు అర్హత కలిగిన దని నాయన సంతసించెను. 21-9—35 తేది నాయన మరల ఖడ్గపురమున పార్వతీశముయొక్క ఇంటికి చేరెను. నాయన తపస్సుకొఱకు ఒక యాశ్రమమును నిర్మింపదలచి అక్కడి భక్తులు డిసెంబరులో నాయనచే దానికి శంకుస్థాపన చేయించిరి. అంతవరకు గుట్టుగా నుంచబడిన స్వర్ణసిద్ధిని ప్రసంగవశమున నాయన వెల్లడి చేసెను. పార్వతీశము మొదలగువారు ఆ మహిమను

*పండిత గోపదేవ ఆత్మచరితము – గోపదేవ్ Printed by ఆర్య సమాజము కూచిపూడి – 1983 – పుటలు164, 165, 166)

చూచుటకు కుతూహలపడిరి. ఆ రాత్రి నాయన అందరు చూచు చుండగా ఒక అర్ధణాకాసుకు (ఇది అప్పుడు రూపాయి సైజులో ఉండెడిది) తన చెమటను పట్టించెను. అది మొదట మాడినట్లుగా ఉండి క్రమముగా పసుపురంగును పొంది బంగారముగా అయ్యెను. అప్పుడీ యోగసిద్ధిని లక్ష్మీకాంతము ప్రసాదరావు మొదలుగా అనేకులు స్పష్టముగా చూచిరి. ఆ నాణెము కొఱకు వారిలో ఆశ కలుగుటను చూచి నాయన ఆ కాసును లక్ష్మీకాంతముచేత డొంకలో విసరివేయించెను.*

శ్రీ బి. ఎస్. రామారావు నాకు 21–4–91 తేదీ వ్రాసిన లేఖలో ఈ సందర్భమును ఇట్లు వివరించెను. "ఆ Coin (నాణెము) యిచ్చింది నేనే. ప్రతిరోజు వారికి (నాయనకు) మధ్యాహ్నం apple (ఆపిల్ పండు) తెచ్చియివ్వటం నావిధి. ఆనాడు apple పండు కొన్నప్పుడు రెండు అణాల బిళ్ళ యిస్తే విక్టోరియా (బొమ్మ ఉన్న) అర్ధణా pure copper (స్వచ్ఛమైన రాగి) వచ్చింది. వారు పండుకై చేయి జాపారు. పండుతో ఆ Coin (నాణెము) వారి చేతిలోకి విడిచాను. వారు పరధ్యానంగా మాట్లాడుతూ మరచి పోయారు కబుర్లు చెపుతూ. అరగంటతర్వాత Mrs. Kantham (లక్ష్మీకాంతముగారి భార్య) పండు అడిగి తీసుకుంది. క్రిందనున్న Coin రంగు మారింది – స్వర్ణం వైపు. వారు చకితులై మంచం మీదనుంచి దిగి – "ఛీ! పిశాచీ" అని ఆ Coin ను Drain Pipe (gutter మురుగు కాలువ) లో జారవిడచి నన్ను మందలింపు చూపే చిఱునవ్వుతో సత్కరించారు. వారు ఎప్పుడూ ఈ విద్యను

*నాయన – పుటలు 700, 701

ప్రదర్శించలేదు...శిష్యులు ఆప్తులు ఈ విద్య చూడ ఇచ్ఛగించి నవ్వుడు ఎక్కడైనా ఒక్క నాణెం వారు సృజించి వారికి చూపారేమో......యీ విద్యుద్వ్యయం (నాణెము బంగారముగా మారునప్పుడు శరీరములోని విద్యుచ్ఛక్తి కొంత వ్యయమగును.) శరీరమును కాల్చేటంతటి క్షోభ కలుగ జేస్తుంది......"

పై లేఖలో కుండలీకరణములలో ఉన్నమాటలు నేను చేర్చినవి.

పార్వతీశము యొక్క బావమఱది కృష్ణరావు పదియేండ్ల వయస్సులో ఆ సమయమున ఆరవ తరగతి చదువుచు బావగారి యింటిలో ఉండేను. అప్పుడు నాయనతో తనకు కలిగిన యనుభవములను స్మరించుచు అతడు ఇటీవల నాయనను గూర్చి ఆంగ్ల వ్యాసమును భారతీయ విద్యాభవనము వారిపత్రికలో ప్రకటించెను.†

ఒకనాడు అక్క కృష్ణరావును శిక్షించుచు ఇంటి నుండి గెంటివేసి తలుపు గడియ వైచెను. కృష్ణరావు తలుపును తట్టుచు ఏడ్చుచుండెను. నాయన తలుపు తీసి అతనిని కౌగిలించుకొని కన్నీళ్ళు తుడిచి ఆమెను పిలిచి, "అమ్మా! పిల్లవానిని ఇంతగా శిక్షించుట తగదు. వీడే ఒకనాటికి మంచి వాడగును" అని చెప్పి అతనిని ఓదార్చెను.

కృష్ణారావు బావగారికి కలిగిన యొక అనుభవమును కూడ ఆ వ్యాసములో వివరించినాడు. రమణ భగవానునితో తనకు చాల

†Bhavan's Journal Vol. 32, No. 9, Dec. 15-1985-
NAYANA THE SAINT- A. K. Rao

చనువు వుండెడిదని, ఇద్దఱును కలిసి తపస్సు చేయుచుండెడి వారని, ఆ సమయములో వారు ఎన్నో అవమానములను భరింప వలసి వచ్చెడిదని నాయన పార్వతీశమునకు చెప్పుచుండెడి వాడు. పార్వతీశము నాయన యందు గాఢమైన భక్తి కలవాడే అయినప్పటికి అతనికి నాయన మాటలు అతిశయోక్తులుగా తోచుచుండెడివి. నాయన స్వర్గస్థుడైన పిదప 1937 లో అతడు తిరువణ్ణామలైకి పోయి రమణ భగవానుని దర్శించెను. నాయన చెప్పినదంతయు నిజమేనా అని భగవానుని అడుగవలయునని అతడు తలంచు చుండెను. కాని అడుగ లేదు. భగవానుడు చుట్టును వున్న భక్తు లందఱను కలయ జూచి ఒక్క క్షణము అతని వైపు నిశితముగా చూచి సొరుగులో నుండి ఒక పుస్తకమును తీసి తెఱచి చూపెను. ఆ పుటలో కూర్చుండియున్న నాయన బొమ్మ వున్నది. ఆ బొమ్మను చూపుచు భగవానుడిట్లనెను. "ఇది నాతోకూడి తపస్సు చేయుచు ఎన్నియో అవమానములను పొందిన మహనీయుడగు నాయన యొక్క బొమ్మ. ఆకలి యైనప్పుడు మేము కొన్ని సమయములలో అగ్రహారము లోనికి భిక్షకొఱకు పోవుచుంటిమి. ఒక్కొక్కప్పుడు జాలిగల తల్లులు ఏదైన పెట్టుచుండెడి వారు. ఇంకొకప్పుడు తిట్టి తఱుముచుండెడి వారు."

"This is the picture of Nayana, a great soul who did tapasya with me and suffered several indignities. Some times when we would feel hungry, we would go to the Agraharam for alms. Some times a kind hearted mother would give us some thing to eat, but at other times they would drive us away hurling abuses."

ఆ మాటలను భగవానుడు తన్ను ఉద్దేశించియే చెప్పెనని గ్రహించి, నాయన మాటలను తాను నమ్మనందులకు భగవానుడు తన చెంపపై కొట్టినట్లుగా పార్వతీశము భావించి పశ్చాత్తాపమును పొందెను.

దీనిని బట్టి నాయనకు భగవానుని యొద్దగల చనువు, నాయన యందు భగవానునకు గల ప్రేమ చాల గాఢముగా నుండెనని స్పష్టమగు చున్నది.

22–3–1935 తేది నాయన కలకత్తాకు లక్ష్మీకాంతముతో వెళ్ళెను. అక్కడ ఒకనాడు నేమాని సూర్యనారాయణ ఒక బీగమును నాయన శిరస్సునకు అడుగున్నర యెత్తున రెండు మూడు నిముషములు పట్టుకొనిన పిదప విద్యుత్ప్రయోగముచే అది అయస్కాంతమువలె నయ్యెను. అప్పు డతడు కొన్ని గుండుసూదులను తెచ్చి దాని సమీపమున నుంచెను. అది అయస్కాంతము వలెనే గుండు సూదులను ఆకర్షించుటను అతడు అందఱకు చూపెను.

అక్కడ నాయన విశ్వమీమాంసకు తాత్పర్యము, ఆత్మకథ, పూర్వకథ తెలుగులో రచింప నారంభించెను. ఈ సమయమున లక్ష్మీకాంతము మొదలగు వారికి ఎన్నో విషయములను బోధించెను. స్వలాభములేని కర్మలు సకామ్యములైనను గొప్పవే అని; ఇటీవలి వారు జ్యోతిష యుగములకు, ధర్మ యుగములకు గల భేదమును గుర్తింప లేదని; వైదికమత ప్రామాణ్యమునకు ఇతర మతము లేవియు సరికావని; బుద్ధుడు నాస్తికుడుగా పరిగణింప బడినను వేదమతానుయాయులు వేదములను విచక్షణతో విమర్శించి గ్రహింప వలయునను తలంపుతోనే వేద ప్రామాణ్యమును నిరసించెనని;

కర్మలందు వినియోగింపబడుచున్న పెక్కు మంత్రములను ఆధ్యాత్మ పరముగా వ్యాఖ్యానింప వలసిన యావశ్యకత యున్నదని అయన వారికి వివరించి చెప్పెను.*

25-4-1936 తేది తనకు ఇష్టము లేకున్నను, ఖడ్గపురము వారు వచ్చి తొందర జేయగా నాయన అక్కడ నిర్మింపబడిన యాశ్రమములో నుండుటకు బయలుదేరి వెళ్ళెను. అది నింపురా చివఱ నుండెను. వేదుల రామమూర్తి, పార్వతీశము, నేమాని సూర్యనారాయణ మొదలగువారి యిండ్లు అన్నియు దానికి రెండు మూడు మైళ్ళ దూరములో నుండెను. అందువలన నాయన సేవ యందు అనుక్షణము శ్రద్ధ చూపుటకు వారికి అవకాశము లేకుండెను. ఆశ్రమ నిర్మాణము నందు, నిర్వహణము నందును రామమూర్తి ప్రధాన బాధ్యత వహించి యుండెను. ఆశ్రమ విషయములో మొదట ప్రగల్భములు పలికిన వారెవరును సాయము చేయుటకు ముందుకు రాకుండిరి. బారమంతయు రామమూర్తి పైననే పడెను. అప్పటికి ఆశ్రమము పేరుతో ఒక పాక మాత్రమే ఏర్పడి యుండెను. అక్కడ వంట చేయుటకు ఏర్పాట్లు లేకుండెను. సమీపమున సోమయాజుల సూర్యనారాయణ అను గృహస్థు వుండెను. ఆయనకు జీతము తక్కువ, కుటుంబ బారము ఎక్కువ. అయన యింటి యందు నాయనకు పగటి పూట భోజనము ఏర్పఱచి, రాత్రి భోజనము కొఱకు రొట్టెలను ఒక జనవాసము నుండి (Colony) పంపు చుండిరి. శనివారములలో మధ్యాహ్నము కార్యాలయములలో

---

* నాయన పుటలు 708 - 714

(Offices) పనులు ముగిసిన తరువాత శిష్యులందఱు నాయన యొద్దచేరి హోమము సల్పుచుండిరి. పిదప నాయన బోధించుటయో లేక పరస్పరముగా చర్చలో జరుగు చుండెడివి.

నాయన పరిచర్యల కొఱకు సింహాలు అను వ్యక్తి కలువకూయి నుండి వచ్చెను. యోగ యుక్తమైన నాయన శరీరమునకు పాలకంటె తియ్యని పండ్ల రసము అవశ్యకము. అప్పుడప్పుడు బత్తాయి నారింజ పండ్లను నాయనకు తెచ్చియిచ్చు చుండిరి. అవి పుల్లగా నుండునని కాబోలు నాయన వానిని ముట్టకుండెను. అందువలననే సింహాలు నాయనకు పండ్ల రసమే అక్కఱ లేదని తలంచెను. భోజనము నందు నాయనకు చిక్కని మజ్జిగ కూడ అమరకుండెను. క్రమముగా ఉష్ణ మధికమై భుజము క్రింద సెగ గడ్డవంటి యొక వ్రణము పైకి లేచెను. అప్పుడైనను అంత ఉష్ణము ఎందులకు కలిగెనని ఎవరును విచారింపకుండిరి. ఆ గడ్డ అణగిపోయిన తరువాత నాయనకు అతిమూత్ర వ్యాధి పైకి వచ్చెను. "నేనిక్కడ మూడు మాసములు వుందును" అని నాయన ప్రసంగ వశమున సూర్యనారాయణతో చెప్పెను. అది నాయన శరీరమును వీడుటకు సూచన అని అప్పుడు ఎవ్వరికిని తోచలేదు. అట్లే నాయన సింహాలుతో ఒకనాడు 'నా దివ్య శరీరము సుఘటితమై, స్థూల బంధమునువీడి, నాకు వశమైయున్నది. సిద్ధ పురుషస్థితి ప్రాప్యము కానున్నది' అని చెప్పెను.* అది ఏదో యోగ రహస్య మనుకొని అతడు ఆ మాటను ఎవరికిని చెప్పలేదు.

* నాయన పుట 719

శ్రీ సోమయాజుల సూర్యనారాయణగారు తెలిపిన యొక వృత్తాంతమున నాయనకు గల యతీంద్రియ శక్తులెట్టివో వ్యక్తమగుచున్నది. "ఎండలు చాలా తీవ్రముగా ఉన్నవి. ఒకరోజు సాయంత్రము నేను నా అలవాటు చొప్పున ఆశ్రమమునకు వచ్చినాను. నాయనగారు ఖిన్నులై విచారముగా నున్నారు. నేను భయపడి కారణమడుగగా, ఆశ్రమములో సదుపాయము లన్నియు సరిగానే ఉన్నవి. కాని ఈ రోజున అబిసీనియా చక్రవర్తి హెయిల సెలాసిన్ రాజ్యభ్రష్టుడై భార్యాబిడ్డలతో బ్రిటీషువారు "అసైలము" (Asylum రక్షణస్థానము) ఇవ్వగా పోవుచున్నారు. ఆ దృశ్యము కనపడగా విచారము వచ్చినది. కాని బ్రిటీషువారే వీనికి 5 సంవత్సరముల తరువాత తిరిగి రాజ్యము ఇప్పించుతారు. అందుచే విచారము తగ్గినది అనెను" అలాగే జరిగినది.

వీరు తెలిపిన మరియొక వృత్తాంతము వలన నాయనకు లౌకికవిధి నిర్వహణమున ఎంత శ్రద్ధ యుండినదో వ్యక్తమగుచున్నది. "ఒక రోజున నేను సాయంకాలము ఆశ్రమానికి వచ్చి ఇవతల వరండాలో కూర్చుని సంధ్యావందనము చేసికొనుచుండగా వచ్చి చూచి సంధ్యావందనము అయిపోయినతర్వాత "నీవు ఆఫీసులో పనిపాటలు సరిగా చేసిన తర్వాత సంధ్యజపము చేస్తే మంచిదే కాని ఆఫీసులో పనిపాటలు సరిగా చేయకుండా ఇంటికి వచ్చి జపముచేస్తే లాభములేదు. ఆఫీసులో పనులు మైమరచినట్లు చేయాలి. అలాగు చేయనిచో భగవంతుడు నిన్ను క్షమించడు."*

---

*జయంతి సంచిక – "నాయనగారితో నా పరిచయము" – సోమయాజుల సూర్యనారాయణ – పుట 33

శిష్యులను సరియైన వర్తనము నందుంచుట గురువులకు కర్తవ్యము. అట్టియెడల గురువులు శిష్యులయెడ మొగమోటమితో వారి లోపములనుచూచి యుపేక్షింపరాదు. నాయన కర్తవ్య నిర్వహ ణమున ఎంత శ్రద్ధ కలిగియుండెనో దీనివలన వ్యక్తమగుచున్నది.

నాయన ఆరోగ్యము క్రమముగా క్షీణింప జొచ్చెను. 21-7-1936 తేది మధ్యాహ్నమున నాయనకు మాటాడుటకుకూడ శక్తి లేకుండ పోయెను. నేమాని సూర్యనారాయణ ఆ స్థితిలో నాయనను చూచి భయపడి రమణమహర్షికి, మహాదేవునకు తంతి వార్త పంపించి లక్ష్మీకాంతమునకు టెలిఫోనులో తెలిపెను. లక్ష్మీ కాంతము భార్యతో ఏపిల్ పండ్లను, గ్లూకోజు డబ్బాలను గైకొని ఆశ్రమమునకు మఱునాడు ఉదయము చేరెను. వారు అరగంట కొకసారి పండ్లరసము, గ్లూకోజు ఇచ్చుచుండగా నాయనకు నీరసము తగ్గెను. మధ్యాహ్నము ఒంటిగంటకు నాయన మంచమునుండి లేచి వస్త్రములు మార్చుకొని వరండాలోనికి నడువగలిగెను. ఇంతలో పెద్ద వర్షము కురిసి పాకయంతయు తడియ జొచ్చెను. పాకనుండి పార్వతీశముయొక్క ఇంటికిపోవుట మంచిదని లక్ష్మీకాంతమనగా నాయన "రేపు శనివారము మధ్యాహ్నము రెండున్నర గంటలకు ఇక్కడనుండి వెళ్ళుటకు బాగుండును" అని స్పష్టముగా చెప్పెను. అది నిర్యాణమునకు ముహూర్తమని అప్పుడు ఎవ్వరికి తోచలేదు.

డజన్లకొద్దిగా ఏపిల్‌పండ్లను తెప్పించి నాయన మాట ననుస రించి రసమును తఱచుగా ఇచ్చుచుండిరి. వైద్యుడు వచ్చి చూచి నీరసము చాలవరకు తగ్గెనని చెప్పెను. పిమ్మట చీకటి పడు చుండగా శ్రీ రమణాశ్రమమునుండి నిరంజనానందస్వామి పంపిన

తంతి వచ్చెను. ''మీ రిచ్చిన రెండు టెలిగ్రాములు భగవాన్ తన యొద్ద నుంచుకొని సమాధానము పల్కలేదు.'' అని ఆ తంతి యందు ఉండెను. నాయన దానిని అందుకొని చించిపారవేసెను.*

శ్రీ రమణాశ్రమము నుండి వచ్చిన తంతిని నాయన చింపి వేయుట ఆశ్చర్యకరము. ఆయన ఎందులకు అట్లు చేసెనో తెలి యదు. మహర్షి ఏదైన సందేశమును తనకు అందింపుడని చెప్పి యున్నను ఆశ్రమమువారు అట్లు చేయలేదని ఆయన శంకించి కోపముతో అట్లు చేసియుండునేమో అని యూహింపవలసి యున్నది. లేకున్నచో గురువు దగ్గఱ నుండి వచ్చిన వార్తగల పత్రమును చింపి నాయన అనాదరమును ప్రకటించునా?

అప్పటికే కలువఱాయి నుండి మహాదేవుడు వచ్చియుండెను. ఆఫీసులో ముఖ్యమైన పని యుండుటచే వెంటనే తిరిగిరావచ్చునను తలంపుతో లక్ష్మీకాంతము కలకత్తాకు పోయెను. అత్యుష్ణమువలన నాయనకు వారము రోజుల నుండి విరేచనము కాకుండెను. పండ్ల రసము వలన 25 వ తేది శనివారము ఉదయమున అయిదారు విరేచనములు అయి మలమంతయు వెలువడెను. అప్పుడు నాయన తెరపినబడి తేలిక నొందెను.

మధ్యాహ్నము ఒంటి గంటన్నరకు శిష్యులందఱు శనివార హోమమునకు వచ్చిరి. వారు హోమము చేయుచుండగా నాయన మంచము నుండి దిగి వారితోపాటు ఆసనబద్ధుడై కూర్చుండెను. తరువాత శిష్యులను పంపి మంచముపై పండుకొని మధ్యాహ్నము రెండున్నర గంటలకు, ఉత్తరీయమునువలె, శరీరమును అనాయాస

---

*నాయన పుట–725

ముగ వదలి "అంతకు పూర్వమే సిద్ధమైయున్న తన దివ్యామృత మయ శరీరమును వహించి యనామయ పదమును బొందెను." *

గుంటూరు లక్ష్మీకాంతము వర్ణించినట్లుగా నాయన 'నవయుగ యోగి చక్రవర్తి' అనుట యథార్థము. కపాలసిద్ధితోపాటు ఆయన సాధించిన సిద్ధులు అనేకములు. ఆయన చేసిన తపస్సు అసామాన్యము. శ్రీరామకృష్ణునకు వివేకానందునివలె శ్రీ రమణ భగవానునకు నాయన ప్రియతమ శిష్యుడై గురువు యొక్క కీర్తిని, సందేశమును దేశమున నలుమూలల వ్యాపింపజేసి గురు ఋణమును తీర్చుకొని చరితార్థు డయ్యెను.

శ్లో॥ జయతు భరతక్షోణీఖండం విషాద వివర్జితం
జయతు గణపస్తస్య క్షేమం విధాతుమనా మునిః
జయతు రమణస్తస్యాచార్యో మహర్షి కులాచలః
జయతు చ తయోర్మాతా పూతా మహేశ విలాసినీ॥

భరతఖండము విషాద వివర్జితమై జయము నొందునుగాక. దానికి క్షేమము కలిగింపవలయునని తలంచుచున్న గణపతి జయము నొందునుగాక. అతనికి ఆచార్యుడును మహర్షి కులాచలుడును అయిన రమణుడు జయము నొందును గాక. వారి కిరువురకును తల్లియైన మహేశ విలాసిని ఉమాదేవి జయించుగాక.

॥ శుభమస్తు

ఓం



* నాయన పుట 728



Biography of

# SRI VASISTA GANAPATHI MUNI

By

**Sri Poluri Hanumajjanaki Rama Sarma**

*Copies available with :*

**R. SREERAMULU**

*10 / 101, Sri Krishna Nagar, KURNOOL - 518 002*


*Published by :*

**SRI RAMANA SATSANGAM**

*ANANTAPUR - 515001*

*Printed at : Auro Printing Press, Tadpatri - 5[illegible]*